ఆహారచర్చకు
రాజన్‌గారి జవాబు
3-వ పేజీ

# ఆంధ్రపత్రిక

కేంద్ర ప్రభుత్వ
కొత్త మంత్రి
6-వ పేజీ

316926

The Andhra Patrika, Madras, } Regd No M. 1118, Vol. 34 No 152 SATURDAY 27th SEPTEMBER 1947 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# జునాఘడ్ సమస్యను తేల్చడానికి కేంద్రప్రభుత్వ స్థిర సంకల్పం

## రిఫరెండం ద్వారా ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవడమే పరిష్కార మార్గమని ప్రకటన

### ఏ యూనియన్ లో నైనా చేరడానికి హక్కు వున్నదని లియాకత్ అలీ జవాబు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 25: రిఫరెండం ద్వారా జునాఘడ్ ప్రజల స్వతంత్రాభిప్రాయం తెలుసుకుని తదనుగుణంగా ఈ సంస్థానం ఏ అధినివేశంలో చేరాలో నిశ్చయించాలని సూచిస్తూ జునాఘడ్ సంస్థాన పరిష్కారానికి ఇండియా ప్రభుత్వం కృతనిశ్చయమైందని సంస్థానశాఖ ఇవ్వాళ రాత్రి ఒక ప్రకటన చేసింది.

ఇండియా ప్రభుత్వం జునాఘడ్ పాలకులతోనూ పాకిస్థాన్ అధినివేశ ప్రతినిధులతోనూ స్నేహ పూర్వకంగా చర్చించడం ద్వారానే క్లిష్టమైన ఈ సమస్యను పరిష్కరించాలని ఆలోచిస్తోందనీ, జునాఘడ్ చుట్టుప్రక్కల వున్న సంస్థానాలన్నీ భారతాధినివేశంలో చేరినందువల్ల వాటి యోగక్షేమాలను సంరక్షించవలసిన బాధ్యత తమమీద ఉన్నదనీ, దానిని సర్వవిధాలా నెరవేర్చగలమనీ ఆ ప్రకటన ఉద్ఘాటించింది.

ఆ ప్రకటనలోని ముఖ్యాంశాలు ఇల్లా ఉన్నాయి:

"జునాఘడ్ పాకిస్తానులో చేరినందువల్ల చుట్టుప్రక్కల కథియవార్ సంస్థాన ప్రజల్లో చాలా ఆందోళన బయలుదేరింది ...

2 వ పేజీ చూడుడు

## నైరృతి ఆఫ్రికాపై అంతర్జాతీయ ధర్మకర్తృత్వస్థాపన సమస్య

### దక్షిణాఫ్రికా ప్రభుత్వ ప్రాతికూల్యం: సారధ్యసంఘంలో ఇండియా ప్రతినిధివాదన

లేక్‌సక్సెస్, సెప్టెంబరు 25: ఈ రోజు ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశ సారధ్య సంఘములో దక్షిణాఫ్రికాకు ప్రతినిధి హెచ్. జి. లారెన్స్ నైరృతి ఆఫ్రికాను అంతర్జాతీయ ధర్మకర్తృత్వమునకు వప్పజెప్పుటకు నిరాకరిస్తూ ప్రసంగించిన తరువాత ఆయనను విమర్శిస్తూ భారత ప్రతినిధి సర్ మహారాజ్ సింగ్ మాట్లాడారు.

"నైరృతి ఆఫ్రికాను అంతర్జాతీయ ధర్మకర్తృత్వమునకు వప్పజెప్పకుండా దక్షిణాఫ్రికా ప్రభుత్వం నిరాకరిస్తూ వుండటంవలన ఆ ప్రాంతముపై ఐక్యరాజ్య సమితికి ఏ మాత్రము పర్యవేక్షణాధికారము లేనటువంటి అసంబద్ధపరిస్థితి ఏర్పడుతున్నది" అని సర్ మహారాజ్ సింగ్ అన్నాడు.

ఈ విషయమై పరిస్థితులన్నీ వివరించి న్యాయశాస్త్ర ప్రకారంగా, నైతికంగాకూడా నైరృతి ఆఫ్రికాను అంతర్జాతీయ ధర్మకర్తృత్వమునకు వప్పజెప్పవలసిన బాధ్యత దక్షిణాఫ్రికాపై నున్నదని భారత ప్రతినిధివర్గం భావిస్తున్నది" అనికూడా తెలియజేశాడు.

ధర్మకర్తృత్వ నిబంధనలు ఐక్యరాజ్య సమితి ప్రణాళికకు ముఖ్యాంగములనియూ, మాండేటరీ అధికారముపై వలసదేశములు పొందిన ఇతర దేశములన్నియు ధర్మకర్తృత్వపు టొడంబడికలు సమర్పించినవనియూ ...

### జిన్నాతో ఆకిన్‌లెక్ సమాలోచన

కరాచీ, సెప్టెంబర్ 25: ఫీల్డుమార్షల్ ఆకిన్‌లెక్ ఈ ఉదయం పాకిస్థాన్ గవర్నర్ జనరల్ జిన్నాను కలుసుకున్నారు ...

## తూర్పు పంజాబులో ఇండియామంత్రులపర్యటన

### పశ్చిమపంజాబునుంచి వస్తున్న కాందిశీకులవిషయమై గవర్నరుతో చర్చ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 25: భారత యూనియన్ ప్రభుత్వ ...



## జునాఘడ్ ప్రజల స్వాతంత్ర్య ప్రకటన

### తాత్కాలిక ప్రభుత్వ స్థాపన

బొంబై, సెప్టెంబరు 25: నేటిసాయంకాలం జునాఘడ్ సంస్థానప్రజలు చాలా మంది మాధవబాగ్ వద్ద బ్రహ్మాండమైన బహిరంగసభజరిపి జునాఘడ్ తాత్కాలిక ప్రభుత్వంద్వారా ఇండియా అధినివేశానికి విధేయులమై ఉంటామని సంస్థానపు ప్రస్తుత పాలకులకు తాము విధేయులం కామని స్వాతంత్ర్యప్రకటన చేశారు. సంస్థానప్రజలు ఎక్కడ నివసిస్తున్నాసరే తాత్కాలిక ప్రజాప్రభుత్వపు ఆదేశాలను శిరసా వహించవలసినదని ఈ మహాసభ ప్రజల నుద్బోధించింది.

శ్యామలదాస్ లక్ష్మీదాస్ గాంధీ నాయకత్వంతో 6 గురు మంత్రులతో ఏర్పడిన ఈ తాత్కాలిక ప్రభుత్వానికి ఈ మహాసభవారు 1947 సెప్టెంబరు 15,కు ముందు జునాఘడ్ నవాబుకు ఉండే సర్వాధికారాలనూ సమర్పించారు.

## పాలస్తీనా సమస్య

### ప్రత్యేక సంఘ సమావేశంలో ఇవాట్ ప్రకటన

#### ఆరబ్బుల బెదరింపు

లేక్‌సక్సెస్, సెప్టెంబర్ 25: "పాలస్తీనాపై బ్రిటిష్‌ప్రభుత్వ ప్రకటన రేపు ఉదయం వెలువడుతుంది", అని ఆస్ట్రేలియా విదేశాంగమంత్రి ఇవాట్, పాలస్తీనా భవిష్యత్తును నిర్ణయించేందుకు ఐక్యరాజ్యసమితి నియమించిన ప్రత్యేక సంఘంలో ఈ వేళ ప్రకటించాడు. డా॥ ఇవాట్ ఈ సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. సయాం ప్రతినిధి ప్రిన్స్ ... ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు.

ప్రత్యేక సంఘం ఈ వేళ తొలిసారిగా సమావేశమైనది. ఈ సమావేశ చర్చలలో పాల్గొనేందుకు పాలస్తీనా అరబ్ ఉన్నత కార్యవర్గ ప్రతినిధులనూ, యూదు ఏజన్సీ ప్రతినిధులనూ పిలుకలిగించేందుకు నిర్ణయించారు. సమావేశం రేపు మధ్యాహ్నం 3 గంటలకు తిరిగి ప్రారంభమవుతుంది.

#### ఆరబ్ సన్నాహాలు

బేరూట్, సెప్టెంబర్ 25: "యూదుల ...

## "ముస్లింలు ద్రోహం చేస్తే వారి ద్రోహం వారినే అణచివేస్తుంది"

### ప్రార్థనసభలో గాంధిజీ ఉద్బోధ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 25: పాకిస్థాన్‌లోని హిందువులను, సిక్కులను రక్షించటం భారత ప్రభుత్వాని[ది]. ఈ విషయమై వారు శాయశక్తులా కృషిచేయటమేగాక, పాకిస్థాన్‌లో హిందువులకు, సిక్కులకు జరిగిన అవమానాన్ని కూడా వారు విస్మరించరాదు. కాని గుణుతికెక్కిన పాకిస్థాన్ విధానము ననుసరించి వారు ముస్లింలను పారద్రోలరాదు. ఈవిషయంలో ప్రభుత్వానికి స్వేచ్ఛ, సర్వాధికారము వుండాలి. ప్రజలందరూ ప్రభుత్వానికి సంపూర్ణ సహకారం చేయాలి. ముస్లింలు ద్రోహులైతే, వారి ద్రోహమే వారిని నాశనం చేస్తుంది. ద్రోహము ఏ ప్రభుత్వమూ సహించలేనంతటి అపరాధము. ద్రోహులను ఏ ప్రభుత్వమూ క్షమించదు. ...

త్వం అప్పటి హిందువులకు, సిక్కులకు చేసున్న అవమానం యూనియన్ ప్రభుత్వం విస్మరించాలని నేను చెప్పటంలేదు. అప్పటి బాధితులను రక్షించటానికి ఈ ప్రభుత్వం శాయశక్తులా కృషి చేయాలి అంటే అర్థం, ఇక్కడి ముస్లింల నందరినీ నిర్దాక్షిణ్యంగా తరిమివేసి, గుణుతికెక్కిన ఆ పాకిస్థాన్ విధానాలను అనుసరించాలని మాత్రం కాదు. ...

#### ఉపన్యాసం పూర్తిపాఠం

(2-వ పేజీ చూడుడు)

## "బ్రిటిష్ సైనికాధికారులు శక్తివంచనలేక పనిచేశారు"

### కుంజ్రూ ఆరోపణలకు ప్రభుత్వసమాధానం: పరిస్థితిపై చర్చకు కుంజ్రూకు ఆహ్వానం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 25 ఇండియా ప్రధానమంత్రి సెక్రటేరియట్‌వారు ఈ విధముగా ప్రకటనము చేసినారు:

"పండిత హృదయనాథ కుంజ్రూ ప్రకటనను ప్రభుత్వమువారు గమనించినారు. ఆయన చెప్పిన అంశాలలో కొన్నిటికి ప్రభుత్వమువారు విచారపడుతున్నారు ...

విశ్వాసముగా పనిచేస్తున్న బ్రిటిషు అధికారులు విపరీతమయిన చిక్కులలో పడిపోయినారు. బ్రిటిషు మిలటరీ అధికారులందరు న్యాకక్తివంచన లేకుండా వారి ధర్మాన్ని వారు నిర్వర్తించినారని ప్రభుత్వమువారు అభిప్రాయపడుతున్నారు. వారిని మెచ్చుకొంటున్నారు కూడాను.

## ముస్లిమేతర కాందిశీకుల రైలుబండిపై దుండగీళ్ల ముట్టడి

లాహోరు, సెప్టెంబరు 25: ...

6 వ పేజీ చూడుడు

## గంటల పంచాంగం

సర్వజిత్ సం॥ భాద్ర॥ శు॥ ద్వాదశి 1947 సం॥ సెప్టెం॥ 27 శనివారం శ్రీ ద్వాదశి ప 9-25 ధని ప 2-30 వర్జ్యం రా 10-16 ల 12-0 కు.

శు॥ త్రయో॥ సెప్టెం॥ 28 ఆదివారం ఆ॥ త్రయో॥ ప 10-58 శత ప 4-28 వర్జ్యం రా 11-9 ల 12-51 కు.



ఆంధ్రపత్రిక

సర్వజిత్ సం॥ భాద్ర॥ శు॥ ద్వాదశి శనివారము

# ఆహార పరిస్థితిపై అసెంబ్లీ చర్చ

రాష్ట్ర ప్రజా ప్రతినిధులు ఆహార పరిస్థితిని అయిదురోజుల పర్యంతము కూలంకషముగ చర్చించిరి. చర్చ ప్రారంభమైన నాటికంటె చర్చ ముగిసినరోజున రాష్ట్ర ఆహార స్థితి ఆశావంతముగ నున్నట్లు ఆహార శాఖామంత్రి తొలిప్రకటన, తుది ఉపన్యాసమువలన వెల్లడియైనది. అంతకు మించి ఈ చర్చవలన కలిగిన ప్రయోజన మేమియు లేదనియే చెప్పవలసి యున్నది. అధికాహారోత్పత్తి కార్యక్రమము ఇప్పటివరకు సంతృప్తికరముగ సాగలేదని విదుల్చిన ఆహారశాఖామంత్రి, ఆ కార్యక్రమము ఇకమీదట ఏవిధముగ నిర్వహింపబడునో సూచించి యుండలేదు. ధాన్యసంగ్రహణలోగడ మూడు వారములలో జరిగిన స్లైలింక మీదటకూడ జరిగిన ప్రమాదస్థితి తొలగి పోగలదని చెప్పిరేగాని, సంగ్రహణ సంతృప్తికరముగ జరుగుటకు ప్రభుత్వమేమి చేయదలచెనో వివరించి యుండలేదు. ప్రజల సహకారము నర్థించుచు శాసనసభలో ప్రకటించి, అధికారులకు ధాన్య సేకరణకై విశేషాధికారములనిచ్చుచూ ఉత్తరువులు చేసిరి. ఇంటియజమాని హాజరున లేనపుడు, అతని యింట ధాన్యమున్నదని అనుమానమున్న తలుపులు బద్దలు కొట్టుటకు కూడ ఉద్యోగులకు అధికారము లివ్వబడెను. అట్టి అధికారములు లేని సందర్భములలోనే ఉద్యోగులిట్టి చర్యలను తీసుకొని యుండిరి. మంత్రులు ప్రదర్శించుచున్న సహసము, సమాధానపై ఖరీ ధాన్య సంగ్రహణ, సివిల్ సప్లయిస్, రేషనింగు అధికారులలో మృగ్యము. అధికారుల మనఃప్రవృత్తి నేటి పరిస్థితులకు తగినట్లుగ మార్పు చెందలేదు. రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గమువారీ విషయమై తీర్మానము చేసియుండుటే గాక, శాసనసభలో జరిగిన ఆహార సమస్య చర్చ సందర్భమున పలువురు సభ్యులుకూడ ధాన్య సేకరణాధికారులు సక్రమముగ ప్రవర్తించుకొనుట లేదని తెలిపియుండిరి. "సంతృప్తికరముగ ధాన్యసంగ్రహణము"ను జరిపిన అధికారుల నభినందించిన ఆహారశాఖా మంత్రి ఇతర అధికారులకు కొక హెచ్చరిక అయినను చేయకుండుట శోచనీయము.

ప్రభుత్వశాఖలన్నిటిలో సివిల్‌సప్లయిస్, ధాన్యసంగ్రహణ శాఖలలో లంచగొండితనము ఎక్కువగ ప్రబలినట్లు ప్రతీతి. కేంద్ర ప్రభుత్వము లంచగొండితనమును నిర్మూలించుటకు, అట్టి అధికారుల కఠినముగ శిక్షించుటకు తగిన చర్యలు తీసుకొనుచుండెను. ఈ రాష్ట్రమున ఈవిషయమై ప్రభుత్వచర్యలగురించి సభానాయకుడు డాక్టరు సుబ్బరాయనుగారు గురువారము అసెంబ్లీలో ప్రశ్నలకొసగిన సమాధానమే మాత్రము సంతృప్తికరముగ లేదు. దొంగవ్యాపారముచే ధనార్జన చేసినవారిని పట్టుకొనుటకు లోగడ కేంద్రప్రభుత్వము తీసుకొన సంకల్పించిన చర్యనే అధికారుల లంచగొండితనమును విచారించుటకు తీసుకొనుట అవసరము.

ఆహారపరిస్థితినిగురించి మంత్రిగారు తెలిపిన లెఖ్ఖలు సబబుగ లేవని, రైతులు ఉంచుకొనదగిన ధాన్యము మొత్తమును నిర్ణయించుటలో ప్రాంతీయపక్షపాతము చూపబడినదని సభ్యులు చేసిన ఆరోపణకు ఆహారశాఖామంత్రి సమాధాన మొసగలేదు. ప్రతికూలపక్షనాయకుడన్నట్లు మంత్రిగారు తొలిప్రకటనములో తెలిపిన లెఖ్ఖలు సరియైనవైన రేషను 10 ఔన్సులనుండి 8 ఔన్సులకు తగ్గింపవలసిన అవసరమే ఉండెడిది కాదు. పంటనుగురించి స్థానికాధికారులు సప్లయిచేసిన అంచనాలు సరియైనవికావని అధికార, అనధికార ప్రముఖులు పలువురు ప్రకటించియుండిరి. పైరు బాగా అయినప్పటికిని ధాన్యము తగినంత, రావలసినంత రాక పోవచ్చును. పైగా ఈ అంచనాలను తయారు చేయు గ్రామోద్యోగులలో పలువురికి వ్యవసాయానుభవమే లేక పోవచ్చును. పంట బాగాఅయినదను కున్న సంవత్సరము పూర్తిగపోవుటయు, పూర్తిగ పోయినదని అనుకొన్న సంవత్సరము పంట బాగా అగుటయుకూడ సంభవించినది.

1945-46 సంవత్సరములో కంటె 1946-47 సంవత్సరముపంట తక్కువఅనే విషయమును ఆహార శాఖామంత్రిగాని అధికారులుగాని గుర్తించినట్లు కన్పింపదు.

మద్రాసు రాష్ట్రము ఎంతవరకు లోటురాష్ట్రమని, ఎప్పుడూ దిగుమతులపైనే ఆధారపడి యుంటున్నదని చెప్పట అధికారులకును, మంత్రులకును పరిపాటియైనది. పది సంవత్సరములుగ పరిస్థితు లీవిధముగ నున్నను పంట నెక్కువ చేయుటకు ఎన్నతగిన పని నేమియు రాష్ట్ర ప్రభుత్వము చేసియుండలేదు. ఇందు విషయమై ప్రస్తుత మంత్రివర్గమున కొక నిర్దిష్ట విధాన మున్నట్లు కన్పించదు. ఆహారశాఖ, వ్యవసాయ శాఖ, పబ్లిక్‌వర్క్సు శాఖ ముగ్గురు మంత్రుల చేతులలో నున్నది. పబ్లిక్‌వర్క్సు శాఖామంత్రివిధానము సంతృప్తికరముగ లేదని "జనణి" ప్రాజెక్టు విషయమున స్పష్టమైనది. ఈ మూడు రాష్ట్ర అసెంబ్లీలో జరిగిన చర్చలను, ప్రశ్నోత్తరములను గమనించిన ప్రతి విషయము రాజకీయాంశమై ప్రాంతీయాభిమాన దురభిమానములకు గురియగుచున్నట్లు కన్పించుచున్నది. ఇట్టి ప్రమాద పరిణామమును అరికట్టి ఆహార విషయములోనే గాక అధికాహారోత్పత్తి విషయమునకూడ రాష్ట్రమునంతను ఏకప్రాంతముగ భావించి వ్యవహరింపకున్న ఆహార శాఖామంత్రి ఏమిచేసినను క్షేమము అనివార్యమే కాగలదు.

# ముస్లిమేతర కాందిశీక రైళ్లకు బందోబస్తు

## మతకల్లోల పరిస్థితి

### సైనికాధికారి సమీక్ష

న్యూఢిల్లీ, సెప్టెంబరు 25: పడమటి పంజాబుకు ముస్లిము కాందిశీకులతో బయలుదేరిన రైలుబండి మొన్నరాత్రి సురక్షితముగా అమృతసరుమీదుగా సాగిపోయిందని ఒక మిలటరి అధికారి ఈ రోజున తెలియచేసినాడు. రైలుబండ్లు సురక్షితముగా అమృతసరుమీదుగా సాగిపోయే పదుపాయముకోసము రైలు దారికి ఈ వైపున ఆ వైపున కర్ఫ్యూ ఆర్డరు అమలు పరచినారు. 23వ తేదీన కర్ఫ్యూ ఆర్డరు అమలు పరిచే పందర్భములో గస్తీయిస్తూ ఉన్న మిలిటరీమీద సాయుధమూకలు వచ్చి పడినవి. కొంతపోరాటము జరిగింది.

పాకీస్థానుకు వెళ్లే ముస్లిము కాందిశీకుల రైలుబండ్లను సురక్షితముగా పంపించే టందుకుగాను ఎందుగా రైలు బండ్లను ఆపి బందోబస్తు అయిన కాపలా ఏర్పాట్లు అన్నీచేసి అతివేగముగా పాకీస్థాను సరిహద్దు చేరేవరకున్నూ నడిపిస్తారు.

తూర్పుపంజాబుబాబతు దక్షిణపు జిల్లాలలో పరిస్థితులు చక్కబడుతూ ఉన్నవి.

అమృతసర్, జలంధరు, లూధియానా, అంబాలపట్టణాలలో మాత్రమే పరిస్థితులు బాగాలేనట్లు వర్తమానాలు వస్తూ ఉన్నవి. అయితే రైలుబండ్లు సురక్షితముగా సాగిపోయేటందుకు అవసరము అయిన బందోబస్తును అంతా చేసినారు.

పడమటి పంజాబులో ముస్లిమేతర కాందిశీకుల సమూహాలు నాల్గు మిలటరి కాపలా క్రిందనకను తూర్పు పంజాబుకు వస్తూ ఉన్నవి. మొదటి రెండు సమూహాలలోనూ కలరా తగిలినట్లు తెలియవచ్చి కలరా నిరోధక టీకాలమందును విమానాలలో పంపించినారు. ఒక డాక్టరున్నూ ఎనిమిది మంది వైద్యవిద్యార్థులున్నూ డా పంపించినారు.

పాకీస్థాన్ పంజాబులో ఉన్న ప్రధాన ప్రాంతాలకు ఒక పెద్ద ముస్లిము కాందిశీకుల సమూహము అప్పర్ చారిడో కాలవ కక్కనుంచి సాగిపోతూ ఉంది. ఈ ముస్లిము కాందిశీకుల సమూహము ఏవిధముగా సాగిపోతూఉంది పరిశీలించడానికి ఒక అధికారి విమానములో పోయిచూచినాడు. ఈ ముస్లిము కాందిశీకుల వెంట సురక్షితంగాటోనూ టాంకులతోనూ ఇండియా మిలటరివారు వెళుతూ ఉన్నట్లుగా కనిపించింది.

కపుర్తల సంస్థానమునుంచి అయిదు వందలమంది ముస్లిము కాందిశీకులు పాకీస్తాన్ పంజాబుకు వెళుతున్నారు.

లూధియానా — దుండగులు లేవతీసుకొనిపోయిన పదిహేడుమంది ముస్లిము స్త్రీలను కోటార్ కలన్ అనే ప్రదేశములో పట్టుకొని ప్రభుత్వ రక్షణములో ఉంచినారు.

ఫిరోజ్‌పూర్ — వివిధ ప్రాంతాలలో ఉన్న ముస్లిము కాందిశీకులను కేంద్రీకరించి మిలటరీ కాపలాతో పంపివేసే ఏర్పాట్లు జరుగుతూఉన్నవి. ఇక్కడకు వచ్చిన ముస్లిమేతర కాందిశీకులను కూడా సుంకిలో సోడాచూచి పంపించినట్లుగా చెప్పుతున్నారు. ముస్లిము కాందిశీకులను ఒక వందమంది ఇప్పటికే కాందిశీకుల శిబిరానికి చేర్చినారు.

అంబాలా — నగరములో ఒక ముస్లిమును పత్తితో పొడిచి వేసినాడు. రాత్రి పరుగ్రామము దోంగిలించుకొని పోతూఉన్నవారిని పోలీసువారు అటకాయించినారు. దుండగులు పోలీసువారికి ఎదురుతిరిగినందువల్ల పోలీసులు తుపాకులు కాల్చినారు. నల్గురు చనిపోయినారు. ఇద్దరు గాయపడ్డారు.

భరతపూరు సంస్థానము పరిహద్దుల మీదనున్న పిక్రీ అన్న గ్రామముమీద భరతపూరు తాలూకు సాయుధ మూకలువచ్చి ముట్టడించినట్టుగా వర్తమానము వచ్చింది. కాని ఈ వార్త ఇంకా ధ్రువపడలేదు.

సెల్కాటుజిల్లా — ముస్లిమేతర కాందిశీకుల నందఃని ఒకచోటికి కేంద్రీకరిస్తున్నారు.

లీలాపూరు — ముస్లిమేతర కాందిశీకుల సమూహాలు యిక్కడనుంచి యథాప్రకారముగా సాగిపోతూ ఉన్నవి. సెప్టెంబరు 20వ తేదీన లీలాపూరునుంచి 30 వేలమంది ముస్లిమేతర కాందిశీకులు తూర్పు పంజాబుకు బయలుదేరినారు.

మాల్టాక్ — ఈ జిల్లాలో కలరా తగిలినట్లు తెలుస్తూ ఉంది.

జ్వాలాపూర్ — కాశి అనే గ్రామాన్ని ఎవరో వెయ్యిమంది ముస్లిములు ముట్టడించినారు. మిలటరీవారు తుపాకులు ప్రేల్చినారు. 16 మంది దుండగులు చనిపోయినారు. తొమ్మిదిమంది గ్రామీణులను దుండగులు చంపివేసినారు. దుండగుల మూకను మిలటరీవారు తరిమివేసినారు.

పరిహద్దు రాష్ట్రము — కోహట్, బన్నూ కలలో దోపిడీలు ఇళ్లు తగలబెట్టడాలు సాగించినట్లు తెలుస్తూఉంది. ఎంతమంది ముస్లిమేతరులకు అపాయము అయిందన్నీ తెలియలేదు. సుమారు ఎంతమంది పంపించిన ముస్లిమేతర కాందిశీకులకు అపాయము అంజినట్లుగా తెలుస్తూఉంది. వివరాలు ఇంకా తెలియలేదు. పెషావరు నుంచి ముస్లిమేతర కాందిశీకులను విమానాలలో తీసుకొని వస్తూఉన్నారు.

## తూర్పుపంజాబు పరిస్థితి

జలంధరు, సెప్టెంబరు 25: తూర్పు పంజాబులో పరిస్థితులు చక్కబడుతూ ఉన్నవి. అయా జిల్లాలు ప్రశాంతముగా వున్నవి. అమృతసర్‌లో సెప్టెంబరు 22వ తేదీన ముస్లిము కాందిశీకులతో ఉన్న లారీని ముట్టడించినారు. ఇరవైఆరుమంది ముస్లిములు చనిపోయినారు. ఆ లారీవెంట ఉన్న మిలటరీవారు తుపాకులు ప్రేల్చినందువల్ల 28 మంది దుండగులు చనిపోయినారు.

ఆ సాయంత్రమే అమృతసర్‌లో ముస్లిము కాందిశీకుల రైలుబండిని ముట్టడించినారు.

ముస్లిము కాందిశీకుల సమూహాలు చాలాపెద్దవి మూడు నిన్న టికినను అమృతసరుమీదుగా సురక్షితముగా సాగిపోయినవి. ఒక్కొక్క సమూహములో 50 వేలమంది ముస్లిములు ఉన్నారు.

ఏ ఘటనా లేకుండా గురుదాస్‌పూరు జిల్లాలోనుంచి ముస్లిము కాందిశీకుల రైలుబండ్లు మూడుదాటిపోయినవి.

హోషియార్‌పూరు జిల్లాలో దోపిడి గాండ్లను అనేకమందిని అరెస్టుచేసినారు. ఫిరోజ్‌పూరుజిల్లాలో ఇద్దరు ముస్లిము స్త్రీలను ప్రభుత్వమువారు తమ రక్షణలో ఉంచుకొన్నారు. ఈ స్త్రీలను దుండగులు లేవదీసుకొని వచ్చినారు.

హిస్సారు జిల్లాలో ముస్లిములు చుట్టుపక్కల గ్రామాలను ముట్టడిస్తున్నారు.

# అమృతసరులో రైలుబండిపై ముట్టడి

## పాకిస్థాన్ ప్రభుత్వ ప్రకటన

కరాచీ, సెప్టెంబరు 25: ఈ రోజు నాయంత్రము పాకీస్థాన్ ప్రభుత్వమువారు ఈ దిగువ ప్రకటనను చేసినారు.

"అమృతసర్‌లో సెప్టెంబరు 22వ తేదీన ముస్లిము కాందిశీకుల రైలుబండిని ముట్టడించినదాని వివరాలు. ఆ రైలు బండిలో ఆల్వారు సంస్థానమునుంచి వస్తూ ఉన్న ముస్లిమ్ కాందిశీకులు 4500 మంది ఉన్నారు. ఆ రైలుబండి ముట్టడి అయిపోయిన తరువాత 1000 మంది గాయపడ్డారు కనుపించినారు. 3000 మరణించి ఉంటారు ప్రత్రాలేకుండా పోవడమో సంభవించినట్లుగా కనబడుతున్నది. ఆ రైలు బండిని ముట్టడించినప్పుడు ఆ రైలు బండిలో ఒక బ్రిటీషు మిలటరి అధికారియున్నూ, రాయల్ ఆర్మీకి సంబంధించిన పదముగ్గురు హిందువులున్నూ, ఎనిమిదిమంది ముస్లిములున్నూ ఉన్నారు. అల్లరిమూకను నిరోధించే ప్రయత్నము చేస్తూ ఉండగానే ఆటోమాటిక్ తుపాకుల కాల్పుల వల్ల బ్రిటీషు మిలటరి అధికారి చనిపోయినాడు. హిందూ సిపాయిలు లొంగిపోయినారు, ముస్లిము సిపాయిలు ఎనిమిది మందిన్నీ ఆ ముట్టడిలో చనిపోయినారు. ఆ ముట్టడి ఏ అంతరాయము లేకుండా రెండుగంటలసేపు సాగిందని తెలుస్తూ ఉంది. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘమువారున్నూ సిఖ్ఖులున్నూ ఈ ముట్టడిని సాగించినారు.

# కేంద్రప్రభుత్వ ప్రకటన

(1 వ పేజీ తరువాయి)

స్థలం భారతాధినివేశంచేత పాలింపబడుతున్నాయి. అదీకాక జునాఘడిలో ఉన్న మొత్తం జనాభా 6,71,000 మందిలోనూ నూటికి 80 వంతులు మహమ్మదీయేతరులే!

ఇటువంటి పరిస్థితిలో సార్వభౌమాధిపత్యం తొలగిన తర్వాత భారత సంస్థానాలు తమ ఇష్టం వచ్చిన అధినివేశంలో చేరవచ్చునని సూత్రప్రాయంగా ఉన్నప్పటికీ భౌగోళికంగా, ప్రజాస్వామికంగా ఎంత మాత్రమూ ఆలోచించక ఈ సంస్థానం తన స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చెయ్యడం సముచితం కాదు. ఈ విషయాన్ని జులై 25వ తేదీన సంస్థాన ప్రతినిధులకు ఇండియా గవర్నర్ జనరల్ సుస్పష్టం చేశారు. సంస్థానాలను చేర్చుకోవడంలో భారత ప్రభుత్వం ఈ విధానాన్నే అవలంబిస్తోంది. ఏ సమావేశంలో జునాఘడ్ ప్రతినిధి ఉన్నాడు కథియవార్ సంస్థానాలన్నీ సమైక్యంగా ఉండాలని జునాఘడ్ నవాబు బహిరంగ సభల్లో తమ ప్రజలను కూడా ఉద్బోధించారు. అయినా భారతాధినివేశంలో ఏదో షరతుల మీద చేరవచ్చునో ఆయన సంప్రతించలేదు. పైగా ముస్లింలీగ్‌తోనూ తెలియజేయకుండా కొంతకాలం పాకీస్థాన్ అధినివేశంలో చేరవలెనా అంటూ పాకీస్థాన్ ప్రభుత్వం అంగీకరించినట్లు ప్రకటన వచ్చింది. ఇంతకుముందు జునాఘడ్ పాకీస్థాన్‌లో చేరనున్నదనే విషయాన్ని ప్రజాభిప్రాయ నిర్ణయంచేత నిర్ణయించాలని పాకీస్థాన్ ప్రభుత్వం రేడియో ద్వారా తెలియజేసింది. దీనికిగాని అతర్వాత మేముపంపిన మరొక ప్రకటనకుగాని మా కెటువంటి సమాధానమూ రాలేదు. అందుచేత భారత ప్రభుత్వం జునాఘడ్ నవాబుకు సంస్థాన శాఖ కార్యదర్శి మీనన్ ద్వారా వ్యక్తిగత సందేశంపంపింది. కాని నవాబ్ అస్వస్థుడై యున్నందువల్ల ఆయనదర్శనం లభ్యంకాలేదు. మీనన్, దివానునుచూచి జునాఘడ్ సమస్యను ఇండియా పాకీస్థాన్ అధినివేశ ప్రతినిధుల సంయుక్త సమావేశంలో చర్చించాలనీ, అందులో జునాఘడ్ ప్రతినిధులుకూడా పాల్గొనవచ్చునని సూచించాడు.

ఈ సూచనను జునాఘడ్ సంస్థానంగాని, పాకీస్థాన్ అధినివేశంగాని అనుసరించలేదు. ఈలోగా జునాఘడు చుట్టుప్రక్కలఉంటూ భారతాధినివేశంలో చేరిన అనేక సంస్థానాల ప్రజల్లో ఆందోళన బయలుదేరిందనీ తమ భద్రతకు తీవ్రమైన అపాయం రానున్నదన్న భయంతో చాలామంది హిందువులు జునాఘడు విడిచి వెళ్లిపోతున్నారనీ, భారత ప్రభుత్వానికి సమ్మగంగా తెలియవచ్చింది.

ఏమైనప్పటికీ జునాఘడు ఉనికినిబట్టి, దానికీ చుట్టుపక్కల సంస్థానాలకూ ఉన్న తిలతండుల సంబంధాన్నిబట్టి అది పాకీస్థాన్‌లో చేరడం జునాఘడ్, తత్పరిసర సంస్థానాలమధ్యా; జునాఘడ్ భారతాధినివేశాలమధ్యా; తద్మూలంగా ఇండియా పాకీస్థాన్‌లమధ్యా నిరంతర సంఘర్షణలకు అవకాశముంటుందన్న విషయం నిశ్చయం.

అందుచేత ఈసమస్యకు సరియైన పరిష్కారమార్గం కనుక్కోవాలని భారత ప్రభుత్వం కృతనిశ్చయమైంది. కథియవార్ అంతటా శాంతి భద్రతలు నిలబెట్టడమే వారి ఆశయం. జునాఘడ్ ఏ అధినివేశంలో చేరాలో నిశ్చయించుకోవలసిన బాధ్యత ప్రజలకు అప్పగించినట్లే ఈ ఆశయం సిద్ధిస్తుంది. ఇందుకోసమే భారత ప్రభుత్వం రిఫరెండం సూచించింది. ఇప్పటికీ నా సూచనకే బలపరుస్తున్నారు. ఇంత సున్నితమై చిక్కులైన ఈసమస్యను పరిష్కరించడంలో జునాఘడ్ పాకీస్థాన్ పాలకులతో స్నేహపూర్వకంగా చర్చించడానికి భారత ప్రభుత్వం సిద్ధంగా ఉన్నది.

# జామ్‌సాహెబుకు లియాకత్ ఆలీ జవాబు

కరాచీ, సెప్టెంబరు 25: "జామ్‌సాహెబ్ పత్రికాప్రకటన చాలా అసత్యాలతో నిండియున్నది. జునాఘడు పాకీస్థాన్‌లో చేరడం విషయమై యథార్థాన్ని బట్టిగాని, సత్యాన్ని బట్టిగాని ఏలేమాత్రమూ ఆయన బహిరంగ ప్రచారము ఆయన చేశాడు. కాఠియవార్లో ఇప్పుడున్న స్థితి నిజముగా పరిస్థితినిబట్టి చూస్తే ఈ ప్రకటన అనవసర ఉద్రేకానికి హేతువులు కాగలవు. అందుచేత ప్రజలకు యథార్థవిషయం తెలియజెయ్యడం అవసరము" అని పాకీస్థాన్ ప్రధాని, విదేశాంగ మంత్రి అయిన లియాకత్ ఆలీఖాన్ ఒక ప్రకటన చేస్తూ జామ్‌సాహెబు ప్రకటనను నిరసించాడు.

ఆయనలో ఇంకా ఇట్లా ఉన్నది.

"జునాఘడు పాకీస్థాన్‌లో చేరడం జామ్‌సాహెబుకు ఇష్టంలేనట్లు కనిపిస్తోంది. ఇట్లా చేరినందువల్ల భారతాధినివేశ సమైక్యత చెడిపోయిందనీ భద్రతకు భంగం కలుగుతుందనీ, ఇదంతా పాకీస్థాన్ అవలంబిస్తున్న గృహచ్ఛిద్రకారక కుతంత్రమనీ ఆయన ఆరోపిస్తున్నాడు.

అసలు పరిస్థితియేమంటే 1947 భారత స్వాతంత్ర్యశాసనాన్ని అనుసరించి ఏసంస్థానమైనా తనయిష్టమువచ్చిన అధినివేశంలో చేరవచ్చు. చట్టరీత్యానూ దీనా సంస్థానాలలో జోక్యము కలుగజేసుకోవడానికి ఎవ్వరికీ అధికారం లేదు. ఈవిషయంలో ఆగస్టు 15కు ముందుగానే ముస్లింలీగు నాయకులు తమ అభిప్రాయాన్ని ప్రకటించి అప్పటినుంచీ దానికి అనుగుణంగానే ప్రవర్తిస్తున్నారు. భారతాధినివేశంలో చేరిన ఏ సంస్థానానికీ పాకీస్థాన్ ప్రభుత్వం ఆక్షేపణ తెలుపలేదు. మొట్టమొదట్లో పాకీస్థాన్‌లో చేరిన ఈ సంస్థానం విషయమై లేనిపోని ఉద్రేకాలు చేలరేపడానికి జామ్ సాహెబు ప్రయత్నించాడు.

బహావల్‌పూరు, మంగ్రోల్‌లపై జునాఘడకు అధికారం స్వాధీనం చేసుకుంటే భారతాధినివేశపు ఆధిపత్యాన్ని ఉల్లంఘించినట్లవుతుందనడం కూడా దుష్టబుద్ధితో చేసిన ప్రకటనే! ఈ జాగీర్దార్లందరూ జునాఘడుకు సామంతరాజ్యాలు. వీటికి సంస్థాన ప్రతిపత్తి లేదు. అందుచేత జునాఘడ్ సంస్థానంతో సంబంధం లేకుండా ఇవి భారతాధినివేశంలో చేరడానికి వీలులేదు.

ఈ స్థానానికి నుంచే, దక్షిణాన [illegible] భారతాధినివేశంలో [illegible] ఏ పథకం కూడా లభించలేదని జామ్‌సాహెబ్ అంటున్నారు. మా కటువంటి పథకం సంగతి తెలియనే తెలియదు. కాని మరొక విషయాలు మనకు వ్యాపారాలను తెప్పించేందుకు ఆరంభించిన ఉద్యమం సంగతి ఎట్లా గౌరవంతో రాజకీయ ప్రత్యర్థుల ప్రోత్సాహమిచ్చింది కాదు కాని మరొక విధమైన ప్రచారం పోరాటము పడుతున్నారన్న విషయం మాత్రం మాకు తెలుసు. ముస్లిం సంస్థానాలకూ ముస్లిం సంస్థానాలకూ విరోధులైనవారి మాయోపాయత్రాల్లో జామ్‌సాహెబ్ పడిపోయినట్లు తోస్తుంది.

ఇండియా పాకీస్థానులకు యుద్ధం జరుగుతుందనీ, జునాఘడ్ తన నిర్ణయం మార్చుకోకపోతే ముస్లింజనాభా అంతా హత్యచేయబడే అవకాశం ఉన్నదనీ ఆయన చూచిస్తున్నాడు. ఇది కేవలం హిందూ సంస్థానాలను దుష్టచర్యలకు పురికొల్పడం మాత్రమే! తమతో చేరిన సంస్థానాలపై దేశక్షేమకర బాధ్యతవహించవలసిన భారత ప్రభుత్వం యిటువంటి ప్రకటనలవల్ల అన్ని పక్షాలకూ నాశనం తప్ప మరొకటి సాధ్యంకాదని జామ్ సాహెబుకూ తదితర సంస్థానాలకూ స్పష్టంగా తెలియజెయ్యాలి."

## పాకీస్థాన్ వైదేశిక శాఖ ఖండన.

జునాఘడ్ రేవు అయిన వీరవాల్ వద్దకు పాకీస్థాన్ సైనికులు 400 మంది చేరారని పత్రికలలో ప్రకటించిన వార్త పూర్తిగా నిరాధారమైనదని పాకీస్థాన్ ప్రభుత్వ వైదేశిక శాఖ ఇవ్వాళ ఒక ప్రకటనలో వెల్లడించింది.

"గోదావరి ఓడ వీరవాల్ వెళ్లినమాట వాస్తవమేగాని అది మామూలుపనులమీదే వెళ్లింది" అనికూడా ఆ ప్రకటనలో ఉన్నది.

# గాంధిజీ ఉద్బోధ

[1 వ పేజీ తరువాయి]

ప్రూనుకుంటే, ఈ పనికందుని, బాల్యంలోనే చంపివేసేవాళ్లము.

రామాయణకథ ప్రసక్తితెస్తూ, తన ప్రసంగం సాగించారు గాంధీజీ. సర్వబలసమన్వితుడైన రావణాసురుని, వనవాసంలో నిస్సహాయుడుగా వున్న రాముడు గెలిచాడంటే, అధర్మాసుని నశ్యత ప్రధానవర్తనం, కల్లనే సాధ్యపడింది. రెండు పక్షాలు క్రూరమైన చర్యలకు పూనుకుంటే, ఒకరినింకొకరు వేలు ముడిచి చూపే అవకాశం ఎక్కడ ఉంది? ఎవరు మొదట కిరాతకంగా ప్రవర్తించారు. ఎవరు ముందు ప్రారంభించారు అనే ప్రశ్నలు యింకొకపై ఆరోపణలు చేయటానికి తగినంత ముఖ్యమైనవి కావు.

భారతీయులంతా చాల ధైర్యసాహసవంతులు. మహా బ్రిటిషు సామ్రాజ్యాన్నే ఎదిరించి పోరాడారు. మరి, ఈరోజు యింత దుర్బలులై పోయారెందుకు? సాహసవంతులు, భగవంతుని తప్ప మరెవ్వరికీ భయపడరు. ముస్లింలు ద్రోహులైతే, వారి ద్రోహం వారిని నాశనం చేస్తుంది. దేశమునకు ద్రోహం తలపెట్టడం ఏ ప్రభుత్వమూ సహించజాలనంతటి అపరాధం; ద్రోహులను ఏ ప్రభుత్వమూ క్షమించదు. కాని అనుమానంమీద వారిని తరిమివెయ్యటం పశుబలం కాదు. గాంధిజీ ఉపన్యాసం సాగిస్తూ, ఇండియన్ యూనియన్‌లో పోలీసులు, సైనికులు హిందువులతో కలిసి, పాకిస్థాన్‌లో పోలీసులు, సైనికులు ముస్లింలతో కలిసి, ఇతరవర్గంవారిని హింసిస్తున్నట్లు తనకు తెలిసిందన్నారు. ఈ వార్త ఆయనకు చాల కష్టం కలిగించింది. ఈ సైనికులు, పోలీసులు విదేశీయులపాలనలో వుండగా, తమ శక్తి నీవిధంగా ఉపయోగించాలో తెలుసుకోలేకపోయారా? ఈ రోజు బ్రిటిషు ఉద్యోగులతో సహా, వీరందరూ ఈ జాతి సేవకులు; వీరు అవినీతిపరులుగా ప్రవర్తించాలని ఉద్దేశింపబడలేదు.

పోలీసులకు, సైనికులకు భయపడవద్దని ఆయన ప్రజలకు హితవుచేశారు. "అసలు, ఈ దేశంలో వున్న కోట్లకొద్ది ప్రజలలో పోల్చి చూస్తే, వారిసంఖ్య ఎంత? ఈ కోట్లకొలది ప్రజలు సక్రమంగా వ్యవహరిస్తుంటే, పోలీసులు, సైనికులు సక్రమంగా వ్యవహరించరేం చెయ్యగలరు?"

తాను ఈరోజు గవర్నర్ జనరలును చూచినసంగతి మహాత్ముడు ప్రార్థన సభలో తెలియజేసెను. తరువాత ఢిల్లీలోని అన్ని వర్గముల ప్రముఖులను ఆయన కలుసుకున్నారు. ఆపైన, కాంగ్రెస్ కార్యవర్గసభకు వెళ్లారు. ఎక్కడకు వెళ్ళినా, ఈ విద్వేషం, ప్రతీకారజ్వాల చల్లార్చటం ఎట్లాగా అనే అందరూ ఆలోచిస్తున్నారు. మానవుడు తనపని చేతనైనంత చేసి, ఆపైన భగవంతునిపై విశ్వాసముంచి, ధారంచెయ్యాలి. తమను తాము సహాయపడేవారికి, భగవంతుడు కూడా సహాయం చేస్తాడు.

# మలెబారులో అంతర్యం

జోగ్జకర్తా, సెప్టెంబరు 25: తూర్పు ఇండోనీషియా ప్రధాని సహాయమంత్రి మలెవాను ఇద్దరు [illegible] కారణం, "తూర్పు ఇండోనీషియాలో ప్రజలు [illegible] కాదు" అని అనేక పోలండుల్లో ప్రకటించిన [illegible] వార్త సత్య, 'అంతరా' ఈ రోజ ప్రకటించింది.

# మద్రాసు అసెంబ్లీ

## ఇర్రిగేషను డిమాండు చర్చ

మదరాసు, సెప్టెంబరు 26: మదరాసు అసెంబ్లీ యీ దినం ఉదయం 11 గం. స్పీకరు శ్రీ జే. శివషణ్ముగంగారి అధ్యక్షతన సమావేశమైనది. ప్రశ్నోత్తరాలు జరిగిన తరువాత శ్రీ ఏ. కే. గోపాలన్ అను కమ్యూనిస్టు నాయకుడు జైలులో 20-9-47 వ తేదీనుంచి నిరాహారదీక్షబూని యున్న విషయమునుగూర్చి సభవారు చర్చించుటకు యితర కార్యక్రమమును త్రోసిపుచ్చాలని శ్రీ ఆనందనంబియార్ గారు తెచ్చిన ప్రతిపాదన అవసరముగా ఆలోచించవలసిన విషయంకాదని స్పీకరుగారు దానిని నిరాకరించిరి.

శ్రీ గోపాలన్ గారు నిరాహారదీక్ష బూనియున్న సంగతియైనా నిజమేనాయని ఒక సభ్యుడు కారాగృహముల మంత్రిని అడుగగా శ్రీ గోపాలన్ నిమ్మరసమును పుచ్చుకుంటూ ప్రస్తుత ఉపవాసం చేస్తున్న సంగతి వాస్తవమేనని మంత్రి శ్రీ మాధవమీనన్ గారు తెలిపిరి.

ఇర్రిగేషను సప్లిమెంటరీ డిమాండు

ప్లైదరువాత పబ్లిక్‌వర్క్సు మంత్రి శ్రీ యం. భక్తవత్సలంగారు యిర్రిగేషను పనులకై రు 500 నామకమైన సప్లిమెంటరీ గ్రాంటును కోరుతూ ప్రతిపాదనగానించిరి.

శ్రీ ఆనంద నంబియార్ కోతను ప్రతిపాదన ప్రతిపాదిస్తూ పలు యిర్రిగేషను స్కీములు విచారణలో నున్నా మా ప్రభుత్వం వారు వేటినీ తొందరగా అనుసరించడం లేదనియు, ఆహారాభివృద్ధికి యిర్రిగేషను సౌకర్యాలు రైతులకు కలుగజేయుటం చాలా అవసరమనియు చెప్పిరి.

శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు కోత ప్రతిపాదనను బలపరుస్తూ తుంగభద్ర ప్రాజెక్టును గ్రాంటుయిచ్చి నిర్వహించవలెననిరి. జమీందారీ భూములలోని చెరువులు కాలువలు మరమ్మతు జరుగకపోవడం చేత అధికాహారోత్పత్తి దెబ్బ తినుచున్నదనియు యీ విషయాలు గూర్చి ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవాలనియు అన్నారు.

శ్రీ కల్లూరి సుబ్బారావు — రు పెన్నారు తుంగభద్ర పేరూరు ప్రాజెక్టులను నిర్వహణములోకి తెచ్చి ఆహారాభివృద్ధికి చేయూత నొసగవలెననిరి.

శ్రీ నివర్తి వెంకట సుబ్బయ్యగారు కడపలో గండికోట ప్రాజెక్టునుగూర్చి ప్రభుత్వం శ్రద్ధ చూపవలసియున్నదనిరి. కడప కర్నూలు జిల్లాలలో [illegible] యిర్రిగేషను ప్రాజెక్టులకు అవకాశమున్నప్పటికీ ప్రభుత్వము వాటి విషయమై యేమాత్రం చర్య తీసుకోకపోవుట విచారకరమనిరి. శ్రీ కే. కోటిరెడ్డిగారు సంగమేశ్వరం ప్రాజెక్టును ప్రభుత్వం నిర్వహిస్తే రాయలసీమ బాగుపడునని, ప్రభుత్వం వారీ ప్రాజెక్టును కొనసాగించవలెననియు కోరిరి.

శ్రీ కోటిరెడ్డి: చిన్న చిన్న ప్రాజెక్టులను కూడా బాగా అభివృద్ధి చెయ్యాలి. పెన్నార్, కృష్ణా, సంగమేశ్వరం ప్రాజెక్టులను బాగా అభివృద్ధిచెయ్యాలి ప్రతి జిల్లాకు ఒక పెద్దపని అందుబాటులో ఉండకపోవచ్చు. కాని అనేక చిన్ననదులు ప్రతిజిల్లాలోనూ ఉన్నాయి. వీటిని వ్యవసాయానికి ఉపయోగించేటట్లు చూడాలి.

శ్రీ రాఘవయ్య: ప్రాజెక్టులను అభివృద్ధి పరచటం, నిర్మించటమేకాక, చెరువులను మరమ్మతుచేసి పూర్తిగా ఉపయోగించాలి. ఈ అల్ప విధానాల్ని కూడా బాగా వినియోగించుకోవటం అవసరం. నెల్లూరుజిల్లాలో అనేక ప్రదేశాల్లో నాగినకెనాల్ పంటకు పనికిరాకుండా ఉన్న భూములున్నాయి. సరిగా చెరువులను తవ్వితే యీ భూములు వ్యవసాయానికి పనికొస్తుంది అసెంబ్లీ ఒంటి గంటకు సభవారు భోజనానికి లేచిరి.

# సర్ షణ్ముగంగారి ఎన్నిక

మదరాసు, సెప్టెంబరు 26. మదరాసు అసెంబ్లీనుండి రాజ్యాంగ పరిషత్తు సభ్య ప్రతినిధిగా నుండిన రాజగోపాలాచారిగారిస్థానే వేరొకరి ఎన్నికకు నామినేషనులు 26 తేదీ సుహ్యాహ్నం 3 గం. లోగా రావలసియుండినది. సర్. ఆర్. కె. షణ్ముగం చెట్టిగారిపేరు సక్రమంలో వచ్చింది. 7 నిబంధనలు అల్లకరించగా పి. రామమూర్తిగారు [illegible] (కమ్యూనిస్టు పార్టీ) దాఖలుచేసినందున, దీని ప్రత్యేకతనిలో అది నిరాకరింపబడింది. షణ్ముగం చెట్టిగారే ఎన్నికోబడుదురు. ఇందుకై అసెంబ్లీ 7వ తేదీ జరగదు. 9 గి అక్టోబరు 9న జరుగును.

## మధుగిరిలో హిందూపురం కాంగ్రెసువారి అరెస్టు

హిందూపురం, సెప్టెంబరు 22: హిందూపుర కాంగ్రెసు సంయుక్త కార్యదర్శి శ్రీ [illegible], యువజన కాంగ్రెసుకు చెందిన రామయ్య అనువారలు మైసూరు ప్రభుత్వ [illegible] అరెస్టు చేసి రు. 250/- లు జుల్మానా, 4 నెలల శిక్ష విధించిరి.

# ఆహారపరిస్థితి ఇంచుమించు చక్కబడిందని మంత్రిప్రకటన

## రంపచోడవరంలో క్షుద్బాధవల్ల మరణించిరన్న వార్త అసత్యమని రాజన్‌గారు

### అసెంబ్లీలో ఆహారసమస్యపై చర్చముగింపు

చెన్నపురి, సెప్టెంబరు 25: రంపచోడవరంలో 15 మంది ఆకలిచేత మరణించినారన్న వార్త కేవలమసత్యమని ఆహారశాఖ మంత్రి డా॥ రాజన్‌గారు నేడుమధ్యాహ్నం శ్రీ ప్రకాశంగారి ఉపన్యాసానంతరం ఒక ప్రకటనచేసిరి. తూర్పుగోదావరిజిల్లా కలెక్టరువల్ల ఆ వార్తను సేకరించితిమని మంత్రిగారు చెప్పిరి.

పలువురు సభ్యులు తిరిగి జిల్లాకలెక్టరువల్ల సమాచారం తెలుసుకొని తెలుపవలసిందని మంత్రిగారినికోరగా మంత్రిగారెట్టి సమాధానమివ్వలేదు. అప్పుడు అధ్యక్షత వహించిన డిప్యూటీస్పీకర్ శ్రీమతి అమ్మన్నరాజాగారుమాత్రం ఆ సమాచారం రేపు సంగ్రహించబడునని చెప్పిరి.

ఫలహారానంతరం అసెంబ్లీ సమావేశమైనప్పుడు శ్రీ ప్రకాశంగారు తమ ఉపన్యాసమును ఒకగంటసేపు సాగించిరి.

ముందుగా, తాము ఆహారవిషయమై డా॥ రాజన్, ప్రధానిగారలకు ఉత్తరము వ్రాసితిమనిరి. డా॥ రాజన్‌గారు, తమ్ముకలిసెదమని ప్రత్యుత్తరమిచ్చిరనిరి. కాని ఈ కలయికలో జరిగినది. "ఉ. వి. సంఘాలను పనిచేయనివ్వకుండుటకు గల నిశ్చయమును తెలుపుట" మాత్రమే. ఈపశ్చిమగోదావరిజిల్లాలో జేమ్స్ అనే అధికారి, ఈ సంఘాల కార్యదర్శులనందరను, 37 కార్యదర్శులలో 35 మందిని తీసివేసినాడట.

సలాంసాహెబ్: శ్రీ ప్రకాశంగారు, ప్రధానిగారికి వ్రాసిన ఉత్తరానికి ఏం ప్రత్యుత్తరం వచ్చిందో తెలుపకోరుతున్నాను."

శ్రీ ప్రకాశం: "ప్రజలకి హితమైనది ఏదీ జరగలేదు.

ఈ కార్యదర్శులను జేమ్స్ తొలగించినాడా-లేక ప్రభుత్వమే ఇట్లు చేయించెనా? ఆహారశాఖ అంతా చెడిపోయినది. ఆహారశాఖనుంచి నీతి అనునది మాయమైనది. నామంత్రివర్గం చేసినదంతా యీ ప్రభుత్వం తల్లక్రిందులు చేస్తున్నదీ ప్రభుత్వం. నేను బోనస్ యిస్తే, అదిమంచిది కాదన్నారు వీరు. కాని మంత్రిత్వాన్ని స్వీకరించిన నాల్గునెలల్లో, రాదాలపైనబడి బోనస్ ఇస్తామని ప్రకటించుచున్నారు. ఉ. వి. స. సంఘాలకార్యక్రమంతో ప్రజలు పూర్తిగా సహకరించేవారు. వారక్కడి లాభాలని గూడా పొందగలిగినారు.

ఈ సమయమున కళా వెంకట్రావుగారు,నవ్వుచు ఏమో అన్నట్లు తోచెను. ఏమంటున్నారని ప్రకాశంగారడుగగా, ఏమి లేదని నవ్విరి.

ప్రకాశం:-రివెన్యూమంత్రిగారి నవ్వే ఉపన్యాసంగా ఎంచవచ్చు.

శ్రీ వెంకట్రావు:— ఆ సంఘాలలో అంతా నామినేటెడ్ డైరెక్టర్లకదా. వాళ్లు ప్రజలకెలా సేవచేయగలరు?

శ్రీ ప్రకాశం: రివెన్యూ మంత్రిగారు చాలా తెలివికలవారు. ప్రతిదానికీసమాధానాలివ్వగలరు.

శ్రీ వెంకటరావు: అది గురువుదగ్గర నేర్చుకొన్నదే

శ్రీ ప్రకాశం: గురువు పేరుతోనే ఇన్ని ఘోరాలు చేశాయి.

డిప్యూటీస్పీకర్: ఎవరు గురువు?

శ్రీ వెంకటరావు: శ్రీ ప్రకాశంగారే. ఈ ప్రశంసంతా వారికే ఒప్పగిస్తాను.

శ్రీ ప్రకాశం: ఈ శిష్యరికమే ప్రాత మంత్రివర్గాన్ని పడద్రోసింది. ఈవిషయాలు చెప్పదలచుకోలేదు కాని నేడు తప్పింది కాదు. ప్రజాసహకారం, ఈ ప్రభుత్వానికి సంబంధించినంతవరకు మాయమైపోయింది. ప్రతివారికీ, ఇతర రాష్ట్రాలవారికి కూడా ఈ ప్రభుత్వానికి ప్రజా సహకారం లేదని తెలిసి పోయింది.

ఒక సభ్యుడు:-సందేహం.

శ్రీ ప్రకాశం:-సందేహం అక్కరలేదు. ప్రజలే నిర్ణయిస్తారు. ఒక పెద్దస్టేట్ విచారణ పెట్టి ఈ మంత్రుల్ని దాని ఎదట నిలబెట్టాలి.

శ్రీ ఆనందన్ నంబియార్:-గోల్డెన్ రాక్‌లో కాల్చి చంపినవార్ని కూడా.

శ్రీ ప్రకాశం:-ఆహా! వాళ్ళని కూడా! కాని శ్రీ నంబియార్ యీ విభేదాలవల్ల లాభంపొందచూస్తున్నారు. గోల్డెన్ రాక్, ఫిరకా రాక్ అన్నీ విచారణలోకి వస్తాయి.

శ్రీ కళా వెంకటరావు:-మేము కూడా అన్ని విచారణలకు సిద్ధమే.

శ్రీ ప్రకాశం:-మంచిది.

ప్రజలకి మంత్రులేం చేస్తున్నారో తెలియును (శ్రీ కళా వెంకట్రావు: వినడు వినడు) ఈ మంత్రులకి ప్రజల సహకారం లేదు. (శ్రీ కళా వెంకటరావు: ఆ మాట పరికాదు) వెయ్యిపార్లు సరికాదన్నా సరే, ప్రకటించానికి సత్యం తెలియును. డా॥ రాజన్‌గారి రిపోర్టులోనే సేకరణకుపోవు అధికారులతో పోలీసులు వెళ్లవలసివస్తోందనీ, కలెక్టరు, మేజిస్ట్రేటులు కాపుదలగా ఉండవలసివస్తోందని, వ్రాయబడింది. ఇది చాలు ప్రభుత్వానికి లభిస్తున్న ప్రజా సహకారానికి తార్కాణం. ధాన్యసేకరణ సరిగా లేనప్పుడు కంట్రోలు ఎలా సాధ్యపడుతుంది?

తరువాత శ్రీ ప్రకాశంగారు ఉత్పత్తి వినిమయదారుల సహకారసంఘాలు ధాన్యసేకరణను ఎట్లు చురుగ్గా సాగించినదీ, తరువాత క్రొత్తమంత్రివర్గం అధికారంలోకి వచ్చినతరువాత ఎట్లు మిల్లు యజమానులవల్ల ధాన్యసేకరణ సందగ్గించిందీ నిదర్శన పూర్వకంగా నిరూపించినారు. వికేంద్రీకరణ విధానమును నూతన మంత్రివర్గం విసర్జించి కేంద్రీకరణ విధానము ననుసరించిరి.

బ్రిటిషువారు ప్రవేశపెట్టిన కేంద్రీకరణ విధానమును అత్యంత సాహసముతో రద్దుపరిచినప్పటికీ తను, కష్టము ంత నూతనమంత్రివర్గం విఫలమొనరించినది. సివిల్ సప్లయిల కమీషనరు మాస్టర్‌మన్ విశేషముగైన ప్రభుత్వోద్యోగియే. అందువల్లనే తామున్నప్పుడు ఏమీ చెప్పటకు సాహసింపని అతడు ప్రస్తుత మంత్రివర్గముయొక్క మనస్తత్వమును గ్రహించియే తన దేశములోని (బ్రిటిషు) కేంద్రీకరణ విధానమును అమలుపరిచినాడనిరి. నూతన మంత్రివర్గం అధికారంలోకి వచ్చిన తరవాత ఆహారం విషయంలో పాలనఅంతా అతడు చేతుల్లోకి తీసుకొన్నాడు. అతని విధానం ఫలితంగానే నేడు ఇట్టి క్లిష్టపరిస్థితి ఏర్పడింది.

అధికాహారోత్పత్తి ఉద్యమం విఫలమై కేవల నినాదంగా మాత్రమే ఉండిపోయింది. ఉత్పత్తిదారులకు ఉచితఫలితాన్నిచ్చినగాని వారు ఆహారము నెట్లు అధికముగా ఉత్పత్తిచేయగలరు? ఉద్యమం వ్యాపించుటకు బదులు సామాన్య ఉత్పత్తియే సన్నగిలింది. ధాన్యంధరల గురించి భారత కేంద్రప్రభుత్వం తన విధానమును మార్చుకొనవలసియున్నది. గతానుభవాల దృష్ట్యా ఆహారవిషయ విధానమును కేంద్రప్రభుత్వం సవరించినగాని కాటకాలు తప్పవు.

ఆర్థికాది సమస్యలను శాశ్వతంగా పరిష్కరించడానికి సోవియట్ ఆర్థిక విధానము ననుసరించుట తమ అభిమతమని ప్రకాశంగారనిరి. వికేంద్రీకరణ విధానము ననుసరించినగాని ప్రపంచంలో ఆర్థిక దుస్థితి ఏర్పడగలదనిరి.

అబ్బులు సలాంగారు, గుంటూరులో రేషనుషాపులలో ఒక్కరోజు బియ్యమే యిచ్చిరనియు, రాజమండ్రిలోగూడ అట్టి స్థితే యున్నదనిరి. ఆహారశాఖమంత్రి యీ సభలోను అశ్రద్ధచేసి కొన్నిలులలో రేషనింగు నిలిపేస్తామనే ప్రకటనచేసిరి. ఈమంత్రివర్గం ఉత్తమపురుషుల స్థాయికి రాలేదు. మంత్రులలో కొందరు తమ ధాన్యం యివ్వలేదు. రాజన్‌గారు తమ ధాన్యం యిల్లుకట్టిన కూలివారికిచ్చేనన్నారు. రంగాగారు తమ భార్య భూముల వ్యవహారం చూస్తున్నది. తమకు తెలియదన్నారు. కాంగ్రెసుపెద్దలు చేయవలసిన పనాయిది? రాజన్‌గారు జిల్లాలలో సంచారం చేయడానికి భయపడుచున్నారు (డా॥ రాజన్ - విశాఖనుండి టిన్నవెల్లివరకు అన్ని జిల్లాలు పోయివచ్చేను) సలాం- అది అబద్ధం. పోవలసిన జిల్లాలకు పోలేదు. మంత్రులు తిరిగివచ్చి ఎన్నో బస్తాలు సేకరించేమన్నారుగాని, ఏమీ చేరినట్లు కనబడదు. పత్రిక ప్రకటనతప్ప గ్రామాలలో ఉద్యోగులు సప్లయిచేసిన సంఖ్యలు తప్పుగానుంటే వాటి ననుసరించి, ప్రభుత్వంవారు తప్పులు చేస్తున్నారు. రాజన్‌గారి ప్రకటన వారి అసమర్థతను రుజువు చేస్తున్నది. అసమర్థులయినచో పదవి విడిచిపోవాలిగాని, రేషను నిలిపేయరాదు. అదనపుజిల్లాలలో రేషను తీసేస్తామంటున్నారు. గుంటూరు యిదివరకు అదనంగా నుండేను. ఇపుడు స్వయం సమృద్ధిజిల్లా అంటున్నారు. రేపు లోటు జిల్లాకాగలదు. ఆహార సంఘాలు కూడా కొంతవరకు అసందర్భ పరిస్థితులకు కారణం. అవి ఎంతకాలం ఉంటాయో ప్రభుత్వంవారే చెప్పలేకుండా యున్నారు. వాటిని గూడ సవరించాలి. ఉ. వి. సహకార సంఘాల విచారణ సంఘంవారి నివేదికను ప్రభుత్వంవారు ప్రకటించి, ఆహారశాఖ పరిపాలన విధానాన్ని మార్చవలసియుండునని సలాంగారు సూచించిరి.

శ్రీ కన్నయప్పన్‌గారు ఆహార క్లిష్టస్థితిని ఆధారం చేసుకొని కక్షల సిఫారసులను ప్రజ్వల్ల చేయుటకు ప్రయత్నించడం యే మాత్రం తగదనియు ప్రజలక్షేమం కోసం ప్రభుత్వమే గాక అందరూ చేరి అతి జాగ్రత్తతో ఆహారకొరతతీర్చుటకు కృషి చేయవలెననియు, ఎవరో కొందరు పెద్దవారు తమ నిలవధాన్యమును యివ్వలేదని ఒండొరులు ఆరోపణలు చేయుటలో కాలహరణం చేయరాదనియు అనిరి. ధాన్యసేకరణను కట్టుదిట్టముగా జరిపి, ఉద్యోగుల లంచగొండితనమును దొంగ వ్యాపారానికి అవకాశం యివ్వకుండా ప్రజలకు సరిగా ఆహారం లభ్యమగునట్లు చేయుట ప్రభుత్వంవారి ధర్మమనిరి.

శ్రీ ఆనందనంబియార్‌గారు ప్రసంగిస్తూ యీ విధంగా నుడివిరి.

బర్మానుండి వెనుక దిగుమతి యగుచున్న 4½ లక్షల టన్నుల ధాన్యం యిపుడు రాకపోవడం ఆహార క్షామానికి ఒక కారణముగా ఆహార మంత్రి తన ప్రకటనలో తెలిపియున్నాడు. ఆహార క్షామానికి కారణాలేమైయున్నప్పటికీ ప్రకాశం ప్రభుత్వపుకాలంనుండి యిప్పటికి పరిస్థితి ఉత్పత్తిదార్లకు బోనస్ యిచ్చేపద్ధతియే ప్రస్తుతపు రాష్ట్రములో ఆహారకొరత ఏర్పడుటకు కారణభూతమైనది. ఉత్పత్తిదారలు తమ సరుకునకు ఏదో విధంగా ఎక్కువ డబ్బు రాగలదనే ఆశతో తక్కువ కంట్రోలు ధరకు సరకును అమ్ముటకు యిష్టపడకుండుట సహజమే కాని యిట్టిది జరుగనీయకుండా నిలవ ధాన్యం యెక్కడ ఉండినా యెవరి దగ్గర నుండినా దయాదాక్షిణ్యం లేకుండా ధాన్యం సేకరిస్తే తప్ప యీ విషమును మనం ఎదుర్కోలేము.

శ్రీ యం. పి. గోవిందమీనన్‌గారు: బలవంతముగా రయితు నిస్తామనే బెదరింపుతో ధాన్యసేకరణ జయప్రదం యేమాత్రం కాజాలదనియు గ్రామ ఆహారసంఘాలు సరిగా వ్యవహరించలేదనే ఆరోపణ మలబారుకు సంబంధించినంతవరకైనా యథార్థం కాదనియు ప్రజల సహకారం లభ్యమగువిధముగ ప్రభుత్వం వ్యవహరించి రేషనింగ్‌ను మానివేయకుండా పనిచేస్తే యీ గడ్డురోజులను మనం దాటగలమనిరి.

బేగం సుల్తాన్ అమీరుద్దీన్ ఆహారసమస్యను పరిష్కరించుటకు ధరల విషయంలో కేంద్ర ప్రభుత్వం అన్ని రాష్ట్రాలలోనూ యేకవిధానమునవలంబించదలచినప్పుడు అంతటా ఒకే విధంగా రేషనింగ్ అమలు జరపవలెననిరి. చెన్నరాష్ట్ర ప్రజల అవసరాలను సరిగా గుర్తించనందుకు కేంద్రప్రభుత్వమును బేగం అమీరుద్దీన్ విమర్శించిరి. చెన్నరాష్ట్రములో ధాన్యపు ధరలను పెంచవలెననియూ కేంద్ర ప్రభుత్వమే హెచ్చుధరల భారమును వహించవలెననియూ చెప్పిరి.

అధికాహారోత్పత్తి ఉద్యమం విఫలమగుటకు వ్యవసాయ పరికరాలు, ఎరువుల ఖరీదులు పెరిగి ధాన్యం ధరలు వానితో సమానంగా పెంచనందువల్లననిచెప్పిరి. వ్యవసాయపరికరాలను ఈ దేశములో తయారుచేయవలెననిరి. వాణిజ్యపంటలను పండించు భూమి పరిమాణంపై నిర్బంధ పరిమితియుండవలెననిరి. ఆహారసమస్య పరిష్కారం కాకపోయినట్లయితే ప్రభుత్వమే కాక ప్రజలు, నాయకులు కూడా నిందితులే ననిరి. రేషనింగును రద్దుపరిచినచో పేదలు అనేకమంది మలమలమాడిపోగలరని చెప్పిరి. ప్రజలందరికీ ఆహారమును సమకూర్చు బాధ్యతవిధిగా ప్రభుత్వంపై నున్నదనిరి. దొంగవర్తకమును అణచుటకు ప్రభుత్వం తగుచర్యలు తీసుకొనుట లేదనిరి.

ప్రధానమైన ఆహారసమస్యగురించిన చర్చలో ప్రధానమంత్రి కూడా పాల్గొనవలెనని సలాంఖాన్, సూచించిరి.

టి. జి. విల్సన్‌గారు ఉద్యోగుల లంచగొండితనం, ధాన్యసేకరణకు నిర్ణయింపబడిన తప్పుడు ప్రమాణములు, ధాన్యపు ధరలు బోనస్ విధానములే ఆహారపరిస్థితి క్లిష్టమగుటకు హేతువులనిరి. ఆహారం కొరతనైనందువల్ల పేదలు మాత్రమే బాధపడుచున్నారని చెప్పిరి. సహకారోద్యమంలో అధికానుభవంగల ప్రస్తుత మంత్రులీ ఉత్పత్తి వినిమయదారుల సహకారసంఘములను ఎందుకు విడిచిపెట్టిరో తమకు తెలియుట లేదనిరి. కాంగ్రెసు ఆదర్శాలకు కట్టుబడినవారే ప్రజోపయోగకరమైన కార్యక్రమాలను ప్రతిఘటించుచున్నారనిరి. దేశంలో అతినికృష్టంగా వున్న ఆహారోత్పత్తిని వృద్ధిచేయుటకు ఇంతవరకు ఈ ప్రజాప్రభుత్వం ఎట్టికృషియూ చేయలేదనిరి.

మిస్టర్ క్లెగోంజర్ రేషనింగును రద్దుపరచరాదనిరి. రాష్ట్రములో జిల్లానుండి జిల్లాకు బియ్యం మొదలగు సరుకులరవాణాపై నిషేధమును ప్రభుత్వం తొలగించవలెననిరి.

స్వామి సహజానందగారు ధాన్యం పాసుకు తగిన పరిహారం కంట్రోలు ధరవల్ల రైతుకు లభించడంలేదని అన్నారు. సాయంత్రం 5 గంటలవుడు సభ అరగంట విశ్రాంతికై లేచెను.

అసెంబ్లీ తిరిగి 5-30 గంటలకుసమావేశమైనపుడు స్వామి సహజానందగారు అరవంలో ధాన్యం ధర పెంచాలని కోరుచు ఉపన్యసించినపిమ్మట ప్రతికూలపక్ష నాయకుడు ఇస్మాయిల్‌గారు పంట ఎక్కువచేయుటకు అవసరంఅని చెప్పుతూ ప్రభుత్వంవారు ధాన్యసేకరణ జరగలేదంటే చేయవలసిన పని చేయలేదన్నమాట యనిరి. ఉత్పత్తిదారులకు వినియోగదారుల భిన్నప్రయోజనాలుండుటచే వారిని కలిపి సహకార సంఘాలు స్థాపిస్తే పనిచేయలేవు. ఆహార మంత్రిగారి ప్రకటనలో కరువుబాపుటకెట్టి నికరమైన సూచనలు చేయలేదు. ధాన్యం ధర పెంచకుంటే ప్రతియేడు ఈ చిక్కు వచ్చు. రైతులు ధాన్యములు పండించుటమాని వాణిజ్య పంటలు పండింతురు. కనుక ధర పెంచాలి. ప్రభుత్వం వారు రేషనింగు జయప్రదంగా అమలు జరిపి అందరికి తిండిపెట్టే పూచీ సర్వదా నిర్వహించలేరని చెప్పుట, తెలఘోషలు చెప్పవలసిన మాటగాని మంత్రులు చెప్ప కలసింది కాదని ఇస్మాయిలుగారనిరి.

#### చనిపోయినవారి పేర్లు

టి. ప్రకాశంగారు,— తమకు రిజిస్టరు లేఖద్వారా ఉత్తరం చేరిందని, అందులో 6 గ్రామాలందు 14 మంది రంపచోడవరం తాలూకాలో తిండిలేక చనిపోయినారని ఆయేసియాలో చనిపోయినవారి పేర్లు గలవని చెప్పి ఆ పేర్లు చదివిరి.

ఆ లేఖలో వారంతా కరువువల్ల చనిపోయినట్లు స్పష్టంగాఉందా, అదికూడా చదవండని ఇస్మాయిలుగారడుగ, అది తెలుగులోనుందని ప్రకాశంగారనిరి.

స్పీకరు- తెలుగయితే వద్దు నాకు తెలుగురాదు.

డా॥ రాజన్- ఆ లేఖయిస్తే డిపార్టుమెంటుద్వారా విచారిస్తాం.

ప్రకాశం: తప్పకుండా యిస్తాను. అందులో డిప్టీ కలెక్టరుసర్క్యులరుకూడా యుంది. (ఇది వేరే యీ పత్రికలో ప్రకటింపబడింది. ఈ లేఖయు సర్క్యులరు చోడవరంనుండి ము. వెం. సోమసుందరం గారు లింగరాజుగారికి, ప్రకాశంగారికి వ్రాసిరి. వీటి తర్జుమాలు ప్రభుత్వానికి అందజేయబడినవి)

మంత్రి మాధవమీనను: అధికాహారోత్పత్తి ప్రచారం జయప్రదం కాలేదని ఆహారశాఖమంత్రియే అంగీకరించిరి. అది 5 సం॥ల కార్యక్రమంకనుక ఒకయేడులో లాభించదు. ఎరువులు నీరు చాలక వ్యవసాయం విస్తరించలేదు. 120 లక్షల ఎకరాలకు 20 లక్షల నేరుఎరువు కావాలి. ఎరువులోపాలు తీర్చుటకు ప్రయత్నించుచున్నారు. నీటిపంపులు 700 నిరుడుపని చేసినవి. 98 ఆయిలు ఇంజనులు రయితులకు విక్రయించితిమి. ప్రభుత్వంవారేమీ చేయలేదనుకోవద్దు.

మలబారులో ఎర్రపెండలంపంట ప్రకాశం మంత్రివర్గంవారు సేకరించేరని నంబియార్ గారనట సరికాదు. ప్రకాశంగారు అట్టి పనిచేయలేదు. సహకార సంఘాల పేరిట కమ్యూనిస్టులు, ఇతరుల పొలాలు బలవంతంగ తీసుకొని ఎర్రపెండలం నాటగా, వారిని తొలగించి ఆ పంటకోయించి ప్రభుత్వంవారే విక్రయించి, పొలాలు అసలు వారికిచ్చిరి. ఇతరుల ఆస్తిదోపిడీని ప్రభుత్వం యిపుడుపుడే సహించదు.

డా॥ రాజన్‌గారు లేచి, 6-15 గం. తాను తూర్పుగోదావరిజిల్లా కలెక్టరుకి టెలిఫోనుచేసి, ప్రకాశంగారు యిచ్చిన కరువు చావులపేర్లు చదివి వినిపించగ వారిట్లు చెప్పేరనిరి:

"కరువువల్ల ఎవ్వరు చావలేదని రాజమండ్రి డివిజను ఆఫీసరువద్దనుండి నాకు టెలిఫోను వార్త వచ్చింది" అయినా ఇంకా విచారించి రేపు మరల టెలిఫోను చేస్తానని జిల్లాకలెక్టరు చెప్పేనని, మంత్రిగారు తెలిపిరి

#### ప్రధాని ప్రసంగం

ప్రధాని ఓ. పి. రామస్వామిరెడ్డిగారు అరవంలో ఉపన్యాసం ప్రారంభించేసరికి పలువురు ఇంగ్లీషులో గాని తెలుగులో గాని మాట్లాడమని కోరిరి.

ప్రధాని: నేను ఇంగ్లీషులోగాని, తెలుగులోగాని మాట్లాడను. అరవంలోనే మాట్లాడెదను. ఇదివరకు యీ సభలో యెక్కువగ పాల్గొనకుండుటకు కారణం, కొందరనుకున్నట్లు ప్రశ్నలకు జవాబుచెప్పలేకుండుట గాని, గంటల కొలదిఉపన్యసించలేకుండుట గాని కాదు. సభ వారి కొంత చిక్కు తగ్గించుటకే తరుచు మాట్లాడను. ఏమంటే అరవంలో మాట్లాడేనని యితర భాషలలోకి తర్జుమా చేయమని కోరుతూవుంటారు.

ఎకరంలో యిదివరకు కన్న ఎక్కువ పండించేటట్లు, ఎక్కువ నేల సాగచేసేటట్లు, చేస్తే ఆహారకొరత తీరుతుంది. ఇరిగేషను ప్రాజక్టులు ప్లానులు కొనసాగుట త్వరలో జరిగేపనికాదు. మనకు ఓవర్సీర్లకన్న ఇంజనీర్లు ఎక్కువగనున్నారు. నాలుగైదేండ్లక్రిందట ఓవర్సీర్ల ట్రయినింగు నిలిపేశారు. అందుచే 90 మంది అప్పరుసబార్డినేట్ల శిక్షణకే అవకాశంగలదు. ఇదో లోపం. సుమారు 600 మంది ఓవర్సీర్లు కావాలి.

"పంట ఎక్కువ పండుటకు ఎరువులు కావాలి. వేరుసెనగ ఎగుమతి నిలిపేస్తేగాని "పున్నాకు" (చెక్క) ఎరువు చాలినంత దొరకదు. ఈవిషయం రాజేంద్రప్రసాదు గారితో చర్చించితిని. ఇంకా జవాబు రాలేదు. పచ్చి ఎరువులు కాపించుటకు డెల్టా ప్రాంతాలలో వీలుకలేదు. యితర ప్రాంతాల నీరు వసతులు లేవు. ఇటువంటి పరిస్థితులలో ప్రభుత్వం శక్తివంచనలేక పాటుపడుచున్నది. వ్యవసాయపనిముట్లకు ఉక్కు ఇనుము 16000 టన్నులు కావలసియుండ 4300 టన్నులు మాత్రం వచ్చింది. యుద్ధంలో ప్రారంభమయిన దొంగవ్యాపారం యిపుడు విపరీతంగా పెరిగిపోయింది. దాన్ని అణచుటలో మీరంతా తోడ్పడాలి. ఈ కష్టాలన్ని ఎరిగి, సహాయం చేయకుండా, ప్రభుత్వాన్ని నిందిస్తామంటే, యితరులతో బాటు మీరూ అపనిందభరించాలి" అని ప్రధాని నుడివెను.

ప్రతికూలపక్ష నాయకుడు అరవంలో మాట్లాడుచు, ప్రధానికి చిక్కులు కలిగించడం తమ యుద్దేశం కాదనియు, శాసనసభ చాల ముఖ్యమయిన సభ కనుక అందు తరచు చర్చలలో పాల్గొని తమను గౌరవించమని ప్రధానిని ప్రతికూలపక్షంవారు కోరుచున్నారనియు, వారు కోరినట్లు తప్పక సహాయం చేయుదుమనియూ చెప్పిరి.

#### డా॥ రాజనుగారి జబాబు

డా॥ రాజనుగారు, ఆహారశాఖమంత్రి చర్చకు జబాబు చెపుతు, కొన్నిలులలో సభ్యులు తక్కువవుండి యున్నందున చర్చ ముందుగా ముగిసిందని, అందుచే ముందుగా తానచట జబాబు చెప్పుట తప్పు లేదని చెప్పిరి.

"ప్రభుత్వంవారు శాసనసభ్యులకేగాక, ఓటరులకు ప్రజలకుగూడ బాధ్యులే. జిల్లాలలోనున్న ఆహారపరిస్థితిగూర్చి ప్రజలందరికీ ముందుగా తెలిపి, శాసనసభలకు ప్రకటన వారంరోజులు ముందుగాయిచ్చి, వారి యభిప్రాయం తెలుసుకొనదలచితిమి. ప్రభుత్వంవారు తాత్కాలికంగా కొన్ని నిర్ణయాలుచేసి, వాటినిగూర్చి శాసన సభ్యుల అభిప్రాయం తెలుసుకొనుటకై (పోజరు) సూచనగా ప్రకటన గావించితిని. కాని అవి స్థిరమైన నిర్ణయములని సభ్యులు భావింపరాదు. నిజమైనస్థితి ప్రజలందరికి తెల్పుటకే మంత్రులు గ్రామాలందు సంచారం చేసిరి. వారి సంచారమందు తోడ్పడి నిజస్థితిని ప్రజలందరి కెరుకపరచుటకు సహాయపడినవారందరికిని పత్రికలకు కృతజ్ఞులము.

"చర్చలో కొన్ని అప్రస్తుత విమర్శలు వచ్చినవి. తూర్పుగోదావరి జిల్లా వారు తాము పండించిన సరుకంతా తినుటకుంచుకోవాలని కోరవచ్చు. అది సహజమే. ఆ జిల్లాలో ఉత్పత్తి అంచనా 3,48,000 ట. ప్రభుత్వం సేకరించవలసిన కనిష్ట సంఖ్య 1,21,500 ట. 1947 సెప్టెంబరులో ఎగుమతి కావలసిన సరకు 9714 ట. అందు 121 ట. మాత్రం సెప్టంబరు 20 తేదీ సరికి ఎగుమతయింది. ఇంకా 9593 ట. ఆజిల్లాలోనేయుంది. అచట తిండిలేక చచ్చిపోతున్నారని ఫిర్యాదులు వస్తున్నాయంటే వింతగనుంది.

"ఆవరకు ప్రభుత్వం ఏదో ఏర్పాటు చేసి ఉంచితే సరిగా నిర్వహించలేక పాడు చేశామని అంటున్నారు. అలా అనడానికి సరియైన సంఖ్యలు తెలుసుకొని మరీ అనాలి. రేషనింగు రాకపూర్వం మన రాష్ట్రం స్వయంపోషకంగా నుండుటేగాక, ఎగుమతి చేసేదికూడాను. ప్రాత మంత్రివర్గంవారు రెండుసార్లు బోనసులిచ్చి, ధాన్యసేకరణ తగ్గుతూవుంటే ఎన్నో పార్లు హెచ్చరికలు చేసిరి. రేషను కార్డులు విరివిగపంచబడెను. ప్రజలు అక్కరలేని కార్డులు వాపసు చేయకుండా వాటిపై బియ్యం తీసుకొని దాచుకుంటున్నారు. అట్టివి అరికట్టుటకు శ్రద్ధవహించుచున్నాము. ప్రజలుకూడ సహాయం చేయాలి. ప్రజలా చేస్తున్నారనే రేషనింగు నిలిపేస్తామని బెదిరించేను. దానిపై ప్రజలు శాసన సభ్యులు ఎట్టి అభిప్రాయం తెలిపెదరో చూదామనుకొంటిని. సర్కారులలో కమ్యూనిస్టులు దాగియున్న సరుకు బయటకు తీయించి తోడ్పడిరి. కాని ఆ పనిచేస్తూ, సేకరణ కార్యంలో నిమగ్నులయియుండ, ముందుగ నేరంచేసినవారికి శిక్షవేసి మరో గ్రామానికి పట్టుకొని ఉద్యోగులను కమ్యూనిస్టులు నిర్బంధించుట భావ్యంకాదు. సరుకుదాగినంతవుంది. అయినా అందరికి లభించకుండా ఉందని రుజువుచేయుటే నా యుద్దేశము. ప్రజలు ట్రిక్కుచేసి రేషను నిబంధన అతిక్రమిస్తున్నారనుట కెట్టి సందేహంలేదు.

"అదనపుజిల్లానుండి సరకు బయటకు రాకుండచే పోలీసుబలం ఉపయోగించి తీసుకుంటానని ప్రధాని చెప్పింది, సింహాచలానికి దొంగవ్యాపారంద్వారా ఎగుమతి జరుగుచున్న తంజావూరు జిల్లాలోని వారికి ప్రభుత్వోద్యోగులకు ఈ దొంగవ్యాపారం అరికట్టుటయందు కమ్యూనిస్టు కిసాను సంస్థలు ప్రభుత్వానికి సహాయం చేయాలి. మంత్రుల సంచారఫలం 80000 ట.

"మంత్రులు సంచారంచేశారుగదా ఏమి తెచ్చేరని కొందరు సభ్యులడిగారు. 1947 ఆగష్టు 21 తేదీన రాష్ట్రంలో ధాన్యసేకరణ చాలతక్కువగ నున్నందున, పైప్రకారం మంత్రులంతా సంచారం ప్రారంభించిరి. తదుపరి 29/8 తేదీతో అంతమయ్యే వారమునందు 13,816 ట సేకరించబడినవి. ఆ తరువాత వరుసగా నాలుగు వారాలందు 13,889—18355, 21737,—21699 టన్నులు సేకరించబడినవి. మొత్తం సుమారు 80,000 టన్నులు వచ్చినవి. ఇదంతా బలవంతం లేకుండా మంత్రులదిగివచ్చిన మాత్రాన వచ్చింది. దీనికైనా మంత్రులను మెచ్చుకోవాలి.

ఉత్పత్తయిన సరకులో 25% మాత్రమే ప్రభుత్వం సేకరించింది. ఇంకా 75% రయితులవద్ద మిగిలివుంది. విత్తనాలు, వారి భోజనానికికూడా అంతు చేరింది. కాగా మిగిలింది వారు విక్రయం చేసినో దాచేరో తెలియదు. అందుకే దేశంలో ధాన్యంలేక పోలేదు. దాన్ని పైకితీయాలని పదే పదే చెప్పుతున్నాము.

"చిన్న రయితులవద్ద ఎక్కువ తీసుకుంటున్నామని ఫిర్యాదులు గలవు, నిజమే. కాని వారికి తిండికి కూలికి విత్తనాలకు సరిపోగా మిగిలిందంతా తీసుకుంటున్నాము. ప్రపంచమంతట ఆహారవస్తువులు కొరతగా నున్నందున, విదేశాల నుండి సరకు రాలేదు. అప్పటికి 28,000 ట. అక్టోబరులో యిస్తామని కేంద్రప్రభుత్వంవారు యిస్తామన్నారు. అది వారే ధరకు కొన్నా, మనకు యెక్కడి ధరకే యిస్తానన్నారు.

వ్యవసాయ నూతుల సహాయానికి 6½ కోట్లు కేంద్రప్రభుత్వం సహాయం చేసింది కేంద్రప్రభుత్వం సహాయం చేయలేదు, బియ్యం పంపుతున్నారుఅని నిందింపరాదు. వారి యిబ్బందులు వారికి గలవు.

ప్రకాశం-ఇపుడెంత సహాయం అడిగినారు-డా॥ రాజన్-4½ కోట్లడిగినాము. ఇస్తానన్నారు.

"నేటి మంత్రివర్గం అధికారంలోకి వచ్చి 18-4-47 నెడ సరికి ధాన్యం నిలవ అంతకు ముందువత్సరం ఆ తేదీనాటి సరకులో సగముండెను. 2 లక్షల టన్నుల కన్న తక్కువ. దిగుమతులు 6 లక్షలు తగ్గిపోయినవి. కనుక మీరేదో మంచి పరిస్థితులలో నాకొప్పజెప్పేమనుకోరాదు.

ఉ. వి. సహకారసంఘాల ద్వారా ధాన్యసేకరణ చేయాలన్నది ప్రకాశంగారి అభిమాన విషయం. ఆ సంఘాలు చాల దుబ్బ్రయోగంచేసిన మాట నిజమే కాని, వాటికి వ్యవధి చాలదో లేక సిబ్బంది సరియైనవారు లేరో కాని, ధాన్యసేకరణసాధనగా అవి సంతృప్తికరంగా పనిచేయలేదనుట నిస్సందేహం. కరువువచ్చి ఉంటే యీసంఘాలద్వారా పరిశోధనం చేస్తూ కూర్చుండానికి వీలుందా? ఈ సంఘాలు సేకరించినవని తెలిపిన సరకులో అధికభాగం మిల్లు యజమానులు సేకరించినవి కూడా చేర్చి చెప్పిరి. లక్షల టన్నులు రావలసినచోట వందలు వస్తూవుంటే ఎలా సరిపోతుంది. ప్రకాశంగారిని సంప్రదించడానికి వీలుపడ్డ రాలేదు.

#### కరువు చావులులేవు

"కనుక, మంత్రివర్గంవారు చేయవలసిందంతా చేస్తున్నారు. కరువువల్ల ఒక్కరు చనిపోయినా యీ సభలో యెలా ఉంటుందో నాకు తెలుసు. కొందరు చనిపోయినారని యిపుడొక అబద్ధపు రిపోర్టు అందజేసి అది నాకిప్పంటున్నారు. కరువువల్ల ఒక్కరినైనా చావనివ్వను, ముందుగా నేను చస్తానుగాని. నిజంగా యెట్టి పరిస్థితులున్నాయో మాకు తెలియక పోలేదు. ఇంకే మంత్రివర్గానికన్న ఈమంత్రివర్గానికి యెక్కువ తెలుసు. గ్రామగ్రామానికి మంత్రులు పోయివచ్చేరు. మరో 3 వారాలకు సరిపోయే సరకు సంపాదించేను. ఇంకొక్క నెల యిట్లే సేకరణ జరిగినచో ఆహారసమస్య తీరిపోయిందని సగర్వంగా చెప్పుకోవచ్చును.

"ధాన్యసేకరణ విషయంలో రెవెన్యూబోర్డు ప్రథమ సభ్యుడుగారిమొదలు గ్రామోద్యోగివరకు అందరు ఒడ్డుచాచుకోకుండ పనిచేసిరి. వారికందరికి మేం కృతజ్ఞులము. అట్టివారిని దొంగలనుట భావ్యంకాదు. నిజమేమంటే కొన్ని జిల్లాలెక్కువ యిచ్చినవి. కొన్ని యివ్వలేదు. కొద్దిమంది ఉద్యోగులు ఆస్తి చేసికొనియుందురు, ఆ లోపాలన్ని సవరించుటకు తగినకృషి చేస్తాము. మొత్తంపై అందరు బాగా పనిచేసిరి. ప్రజలుకూడ వారియత్నాలకు తోడ్పడి, 8 ఔం. లకు మించి రేషను తీసుకోకుండావుంటే అంతేచాలు. ఈ రేషను ప్రమాణం తగ్గకుండుటకు ఎన్నో కూడని పనులు చేయవలసివస్తున్నవి. అతిథి సత్కారం నిషేధించుట మనదేశంలో తప్పు 30 మంది అతిథులకు మించి విందు చేయరాదని, వివాహపు విందులకుగాక పరిమితి ఏర్పరిచి, గుండెరాయిచేసుకొని, రేషను కఠినియమాలు అనుసరిస్తున్నాము. ఈ కార్యమునందు అన్ని రాజకీయపార్టీలవారు సహాయంచేయాలి." అని రాజనగారు విన్నవించిరి.

కొందరు తాను వైద్యుడుగనే ఉండుట మంచిదని సూచించినదానికి బదులుగా, తాను శస్త్రచికిత్సనుని నేలచికిత్స అనుపయోగి వ్యవసాయం చేస్తున్నానని అది బాగుండదని మంత్రిగారు తెలిపిరి. చెరకు నేదుకైనా అరిటితోటలు ధాన్యం పొలాలుగా మార్చుట అంత లాభదాయకం కాదనిరి.

"ఈ ఆహార కొరతపరిస్థితులు యింకో మూడు లేక నాలుగేండ్లుండవచ్చును. కనుక కరువునివారణ సాధనలు ఆలోచించాలి. ఉత్పత్తిదారులతో కూడిన ధరల సమస్య న్యాయముగా ప్రభుత్వం వారు నిర్ణయించిరి. ధాన్యం ధర పెంచుటకు కేంద్రప్రభుత్వంతో వీలయినంత ప్రయత్నం చేయుదుము.

"గ్రామసీమల రేషనింగు నిలిపివేయుటను గురించి, శాసనసభలలో వెలువడిన అభిప్రాయము ననుసరించి ప్రభుత్వంవారు స్థిర నిర్ణయం గావింతురు 3 లక్షల టన్నుల నిలవ ఉంటేగాని రేషనింగు జయప్రదముగా అంతటా కొనసాగదు. అది సేకరింప ప్రయత్నింతుము" అని మంత్రిగారు చెప్పిరి. సభ రాత్రి 8 గం. ముగిసెను.

ప్రకాశంగారు తెలిపిన 14 మందిలో రంపచోడవరం తాలూకాయందు 13 గురు మాత్రం చనిపోవుట నిజం, వారు కరువువల్ల కాక సామాన్య కారణాలవల్ల చనిపోయిరని, 14 వ వాడు యింకను బ్రతికియున్నాడని తూ. గోదావరి జిల్లా కలెక్టరు నేడు టెలిఫోనులో చెప్పినట్లు ఆహారశాఖ మంత్రిగారు అసెంబ్లీలో నేడు(శుక్రవారం) ప్రకటించిరి.

## రంప చోడవరంలో ఆకలిచావులు

రాజమహేంద్రవరం, సెప్టెంబరు 24: చోడవరం తాలూకా కాంగ్రెసు కమిటీ కార్యదర్శి, యువజన కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామ్మన వీరభద్రయ్యగారు రంపచోడవరం ఏజన్సీలో ఈ దిగువ తెలిపిన ప్రకారం 14 మంది తిండిలేక యీ మధ్య చనిపోయినారని తెలిపినారు.

| చనిపోయినవారిపేరు | వయస్సు | గ్రామం |
|---|---|---|
| 1 కోనూరి తిరుపతమ్మ | 40 | రంప |
| 2 పంపిరెడ్డి సూరమ్మ | 35 | రంప |
| 3 పంపిరెడ్డి చిన్నమ్మ | 25 | రంప |
| 4 కోతుకొండ జగ్గయ్య | 10 | రంప |
| 5 సింగోజు బుచ్చయ్య | 60 | ముక్కినాడ |
| 6 చోళ్ళంసూరన్న | 35 | శ్రీపురం |
| 7 సుందు బుల్లమ్మ | 50 | బందపల్లి |
| 8 కారంపావమ్మ | 25 | మూలపాడు |
| 9 ఎంటుకుంచిన్నారెడ్డి | 25 | చిలకమామిడి |
| 10 కుంజా బాలయ్యరెడ్డి | 40 | చింకమామిడి |
| 11 వసుపుచిన్నయ్య | 50 | చిలకమామిడి |
| 12 కర్తుల రామయ్య | 36 | చిలకమామిడి |
| 13 బోయిన బాలయ్య | 75 | చిలకమామిడి |
| 14 బోయిన చిలకమ్మ | 45 | చిలకమామిడి |

(స్వ. వి.)

## గ్రామోద్యోగులకు డిప్యూటీతాసిల్దారు తాఖీదు

రంపచోడవరం డిప్యూటీ తాసిల్దారు సెప్టెంబరు 16-వ తేదీన ఏజెన్సీ ప్రాంతంలోని అన్ని మఠాల గ్రామోద్యోగులకూ ఈ దిగువ తాఖీదు పంపినట్లు తెలిసింది.

"మీ గ్రామాలలో కూలివిషయంలో గానీ, ప్రభుత్వానికి ప్రతికూలంగాగానీ ఆందోళన జరుగుతూ, సభలు మొదలైనవి జరిగేటట్లుంటే అట్టివి జరుగకుండా చూడాలి. అట్టివి జరిగితే మిరపకాయ టపాద్వారా నాకు తెలియచేయాలి. ఈ విషయంలో అశ్రద్ధ చేస్తే మీమీద తగు చర్యతీసుకోనడమగును. ఈ తాఖీదు ముట్టిన వైనం తెలుపగలరు.

[రంపచోడవరంలో కాటకపరిస్థితి అంతకంతకు తీవ్రముగనున్నదనీ, దాదాపు 15 దినాలనుంచీ ప్రజలు తాటిపండ్లు తింటూ గడుపుతున్నారనీ, బియ్యముదొరకక ఆకలితో అలమటించి 12 గురు చనిపోయినారనీ 'ఆంధ్రపత్రిక'లో ఈనెల 21-వ తేదీనే ప్రచురితమైనది. ఈనాడు ఆసంఖ్య 14 అయింది. సంపాదకుడు.]

## తూ॥ గో॥ జిల్లా ఆహార స్థితి

రాజమండ్రి, సెప్టెంబరు 23: తూర్పు గోదావరిజిల్లా ఆహార పరిస్థితుల గురించి ఆలోచించుటకు మొన్న శ్రీ మారెళ్ళ సుబ్బారావుగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగెను. శ్రీ కొవ్వలి లింగరాజు గారు మాట్లాడుచు జిల్లాకు యేర్పాటుచేయబడిన ప్రొక్యూర్‌మెంటు కోటా చాలా ఎక్కువగా నున్నదనియు, జిల్లా ఆహారకమిటీవారు దీన్ని తగ్గించమని కోరినను రెవిన్యూబోర్డువారు తగ్గించలేదనియు, యిది అక్రమమనియు చెప్పిరి.

శ్రీ మట్నూరి సోమసుందరంగారు మాట్లాడుచు తిండిలేక రంపచోడవరం ఏజన్సీలో 12 గురు చనిపోయినని తెలియవచ్చుచున్నదనియు, తూ॥ గోదావరిజిల్లా మిగులుజిల్లా కాదనియు, జిల్లానుండి యెగుమతిని ఆపించమనియు చెప్పిరి. శ్రీ మద్దూరి శివరామకృష్ణరావుగారు మాట్లాడుచు ఆహారపరిస్థితి చాలా క్లిష్టముగా నున్నదనియు, బియ్యముమీదనే పూర్తిగా ఆధారపడక యితర పదార్థములని తిని బ్రతుకుటకు ప్రజలు ప్రయత్నించవలెననియూ చెప్పిరి. స్వ. వి.

# లంచగొండితన నిర్మూలన

## అధికారేతర సంఘముల నియమించునది లేదని హోంమంత్రి ప్రకటన

చెన్నపట్నం, సెప్టెంబరు 25 : లంచగొండితనమును నిర్మూలించుటకు మద్రాసు ప్రభుత్వ మేమి చేసినదీ జూలై 26 వ తేదీ ప్రకటనలో తెలిపియున్నదనియు, ప్రతి తాలూకాకు అధికారేతర సంఘముల నియమించునది లేదనియు, ఈ విషయమై ఏమిచెయ్యవలసినదియు తెలుపుటకు నియమింపబడిన విచారణసంఘమువారి నివేదిక అనంతరము ప్రభుత్వము ఆలోచించి చర్య తీసుకొనగలరని నేటి ప్రశ్నలకాలములో హోం మంత్రి డా॥ సుబ్బరాయన్‌గారు ఎస్. సి. బాలకృష్ణన్‌గారికి సమాధానముగా చెప్పిరి.

సలాం : అధికారేతరులను నియమించరు ఎందుకని? అధికారేతరులకన్న ప్రభుత్వమునకు అధికారులు అంత విశ్వాస పాత్రులా ?

స : ఇది విశ్వాసము, అవిశ్వాసమునకు సంబంధించినది కాదు. ఏది ఉత్తమమార్గమో కాలపరిస్థితినిబట్టి అమలుచేయదగును.

శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య: ఈవిచారణలలో పెద్ద ఉద్యోగులు తప్పించి చిన్నవారినే బలిచేయుచున్న సంగతి మంత్రిగారెరుగుదురా?

స నేను ఒప్పుకొనను.

శ్రీ నాగప్ప చెడ్డపేరు పడ్డవారిని వెంటనే బర్తరఫు చేయించవలెదా?

స బుజువు తక్కగా ప్రభుత్వము ఏమి చేయ వీల్లేదు ప్రభుత్వ నిబంధనల ననుసరించి చేయవలసి యుండును

కరుంత్తగారు: ఫలానివారిపై ఇంద్రియ నిగ్రహములేని బలమైన అనుమానమున్నచో వారిపై చర్య తీసుకొంటేమని తెలుపుట యుక్తముకాదా?

స గౌరవ సభ్యుని సూచనను పరిశీలించెదను

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధికారేతరుల నియమించుట రాష్ట్రీయ విధానమునకు మంచిదికాదని తెలియునా?

స నేను నా అభిప్రాయమును చెప్పను

నాగప్ప దేశపరిస్థితులు మారినందున ప్రభుత్వ నిబంధన కూడా మార్చరా?

స గౌరవ సభ్యుడు మంత్రి అయిన తర్వాత మార్చవచ్చును (నవ్వు)

శ్రీ విశ్వనాథంగారు వారు మంత్రి అవుటకుగాను గౌరవనీయులైన మంత్రిగారు ఏమి చర్య తీసుకొనుచున్నారు. (నవ్వు)

స ఈ విషయమున నాకంటె తెలియరు గౌరవసభ్యుని కంటె తెలియును

### బట్టల రేషను

శ్రీ హెచ్ సీతారామ రెడ్డిగారు బట్టల రేషను ఉత్పత్తి పెంచుటకు కేంద్ర ప్రభుత్వమువారు ఆలోచించుచున్నారనియు, వారు ఈ రాష్ట్రమునకు అన్యాయం చేసిరను ఆరోపణను కాదనుగోరించ మరియు బేగం అమీర్‌ద్దీన్ గారి ప్రశ్నకు సమాధానంగా చెప్పిరి

ఉపప్రశ్నలకు సమాధానముగా ఈ రాష్ట్రమునకు హెచ్చుకోటా ఇవ్వవలసినదని అనేకసారులు కేంద్రప్రభుత్వమును వర్తించియుండిరనియు గ్రామములకు అన్యాయం జరుగుట లేదనియు, ఉన్నదానిలో ఇచ్చుచున్నామనియు చెప్పిరి.

### లేడీ హెవాప్ కళాశాల

చెన్నపురి, సెప్టెంబరు 25 : గుంటూరు లేడీ హెవాప్ కళాశాలను ప్రభుత్వమువారు సూడులకుల పెట్టబడితోను, సాలీనా 20, 25 వేల ఖర్చుతోను నడుపుటకు అంగీకరించిరని వెన్నెలకంటి రాఘవయ్య గారికి సమాధానముగా విద్యామంత్రి అవినాశిలింగం గారు చెప్పిరి.

ఉపప్రశ్నలకు సమాధానముగా మిషనరీ సంస్థలకు పోటీ వచ్చినప్పుడు ఈ పని జరిగెననియు, మున్సిపాలిటీ 5 ఏళ్ళలో 30 వేలు ఖర్చు ఇచ్చుకొనుననియు, పాత ప్రిన్సిపాల్ దీనామాఇచ్చెననియు చెప్పిరి.

### చేనేతవస్త్రాల కంట్రోలు

పెదకాకాని: చేనేతవస్త్రాల కంట్రోలు రద్దుచేయు కారణము, కోరు వ్యాపారస్తులు యిచట వ్యాపారస్తులకు ఉత్పత్తిదారులపై నూటికి 4 మించిన ధరకు విక్రయించరాదని శాసించుచు ప్రభుత్వంవారు ప్రకటించిరి.

బట్టా-జిల్లా కంట్రోలు ఆఫీసరు అర్డరు జారీచేసిరి. అందుకోసు వ్యాపారస్తుడు ఉత్పత్తిధరకు 4% మించకుండాను, చిల్లర వ్యాపారస్తుడు 14% మించకుండాను విక్రయించాలని విధించిరి. సేల్సుటాక్సు అదనంగా వసూలు చేయవచ్చును.

హిందూపురం సెప్టెంబరు 22: మొన్నటికి ఇక్కడి ప్లేగు తగిలినవారిసంఖ్య నూటికి పైబడెను. ప్లేగు తగ్గుటాయని మనము కన్పించకేదు. పక్కగల్ల ప్లేగు హెచ్చ పురములనుండి అది వ్యాపించు చుండునా. మన్ని గ్రామములకూడ ప్లేగు వ్యాపించినది.

# పట్నంలో తెలుగు ప్రయాణీకుల ఇబ్బంది

## రవాణామంత్రి, విశ్వనాథం గారల వాద ప్రతివాదములు

చెన్నపట్నం, సెప్టెంబరు 25 : శ్రీ కెన్నేటి విశ్వనాథంగారికి సమాధానముగా రవాణామంత్రి డేనియల్ థామస్ గారు చెన్నపట్నంలో బస్సులలో ఉన్న రేట్ల బోర్డులు తమిళము, ఆంగ్లభాషలలోనే ఉన్నవని నేడు ప్రశ్నలకాలములో అంగీకరించిరి. మద్రాసు ద్వైభాషామండలమన్న సంగతి ప్రభుత్వమువారెరుగుదురా అనగా మంత్రిగారు బహుభాషా మండలమని తెలుసుననిరి. తెలుగు ప్రయాణీకుల కడగండ్ల గురించి తెలుగులో కూడా బోర్డులు వేయించరాదా అనగా అట్టి ఆక్షేపణలు తమకు ఏమియు రాలేదనియు, రెండు భాషలలోనూ ప్రజలు వ్యవహారమును నడుపుకొనుచున్నారనియు మంత్రిగారు చెప్పిరి.

శ్రీ విశ్వనాథం : మద్రాసు బహుభాషా ప్రాంతమని మంత్రిగారు అంగీకరించినందున, వారిమాట మేరకు ఆ భాషలన్నిటిలో బోర్డులు వేయించుట ప్రభుత్వ కర్తవ్యము కాదా ?

స:—నా సమాధానం రెండోభాగమును మరల గమనించగోరుచున్నాను. నా కెవ్వరూ ఎట్టి ఆక్షేపణా తెలుపలేదు.

విశ్వనాథం:—వేలకొద్దీ ప్రయాణీకులు అవస్థపడుచున్న సంగతి మంత్రిగారు గుర్తించవలసి ఉన్నదని నేను చెప్పినమీదట నైనా మంత్రిగారు ఆయా భాషలలో బోర్డులు వ్రాయించరాదా?

స:—ఈబోర్డులు మారి ఎప్పుడూ బస్సులలో ప్రయాణము చెయ్యరనియు, 10 11, 12, 13 అంకెలు మారి ఎక్కడరనియు గౌరవసభ్యునికి తెలియవలెనందును. అన్ని నెలలుండి బాధపడినను ఒక్కడైనను మాకు బాధపడుచున్నట్లు వ్రాయలేదు.

శ్రీ విశ్వనాథం : బాధపడుటలేదని మంత్రిగారి అభిప్రాయపడిన చాలునా? అంతటితో మంత్రిగారు ఊరుకొందురా?

స : గౌరవసభ్యుడు ఏ తరహాలో ఈ ప్రశ్న వేసిరో నేను ఆ తీవ్రతతో నే వారి ప్రశ్నను తీసుకొనగలను.

శ్రీ విశ్వనాథం : ప్రజలు బాధపడుటలేదని మంత్రిగారు ఎంత తీవ్రతతో అంటే మాట్లాడినారో నేను అంత తీవ్రతతోనే చెప్పినాను. మంత్రిగారు అరవంలోను, ఆంగ్లములోను బోర్డులు తీసివేసి అంకెలే ఉంచరాదా?

కందస్వామి పిళ్ళె:—తమిళమునందును, ఆంగ్లమునందును ఎంతకాలము నుంచీ ఇవి వ్రాయబడుచున్నవి?

స:—నాకు తెలియదు.

సలాంగారు:—తెలుగువారు ఇబ్బంది పడుటలేదని మంత్రిగారు చెప్పిన అభిప్రాయం మంత్రిగారిగుండలి అభిప్రాయమేనా? లేక ఒక్క గౌరవ సభ్యుని దేనా?

స:—గౌరవ సభ్యుడా ప్రశ్న అడుగవచ్చును.

రఘునాథ్:—ఈ తమిళతెలుగు భాషలు, విశ్వనాథంగారు పార్లమెంటు సెక్రటరీగా ఉండగా ఏమి చేసినారు? అప్పుడే గుర్తించినారా?

స : గౌరవ సభ్యునకే చెప్పవలసినదే ఈ ప్రశ్న.

అన్సార్ సాహెబ్ : చెన్నపట్నం ఆంధ్రులదని వక్కాణించుటకు ఈ మధ్యను నిర్ణయింపబడినదా ప్రకారము ఒక ఉద్యమము బయలుదేరినదా ?

స్పీకరు : అసంగతి ప్రత్యేక ప్రశ్న అడగండి.

# ఆంధ్ర పేపరు మిల్స్ లిక్విడేషన్

## హైకోర్టు ఉత్తరువు

చెన్నపురి, సెప్టెంబర్ 25: రాజమహేంద్రవరంలోని ఆంధ్ర పేపర్ మిల్స్ అప్పులను తీర్చలేకపోయినందువల్ల శ్రీ ఖండేలాల్ లాల్లాస్ పటేల్ (బొంబాయి) పెట్టిన పైమిల్సును లిక్విడేట్ చేయుటకు తన్ను, ఆర్. ఏ. యస్. ప్రైస్ అండ్ చార్టర్డ్ అకౌంటెంటును నియమించుచు నిన్న మద్రాసు హైకోర్టులో జస్టిస్ క్లార్క్ ఉత్తరువుచేసిరి.

### చిత్తూరు నుండి బెల్లం ఎగుమతి

చిత్తూరు జిల్లానుండి పైజిల్లాలకు బెల్లం ఎగుమతి కోటాలు నూటికి 37½ వంతు ప్రాంత వ్యాపారస్తులకు, 37½ వంతు ఉత్పత్తిదారులకు 25 వంతు క్రొత్త వ్యాపారస్తులకు ప్రభుత్వంవారు నిర్ణయించియుండిరి. జిల్లాకలక్టరు సూచించిన వ్యవధిలోపల ఉత్పత్తిదారులు ఎగుమతి చేయ కపోయినచో ఆ కోటా వ్యాపారస్థులకు మార్చబడును.

